
PARLE
POPPINS
Goli Rainbow Wali - Doon Kya?
Ram and Shyam
మనషికి ఉత్తమ స్నేహితుడు
భాగం-2
జరిగిన కథ: వేరే నక్షత్రాల వీధి పాలపుంత గ్రహాంతరవాసులు డిక్ట్రిక్స్‌ని వెతుకుతు భూమికి చేరుకుంటారు. వారి గ్రహాంతర కుక్క కాకతాళీయంగా రామ్ మరియు శ్యామ్‌ని వారి వైపుకు తీసుకొస్తుంది.
తర్వాత భాగం....


పిల్లలు జెనాన్‌ని వెంటాడుతు గ్రహాంతరవాసులను చేరుకుంటారు.
ఇక మనం డిక్ట్రిక్స్‌ని పట్టుకోవడం ఎలా?
ఓహ్! వారికి డిక్ట్రిక్స్ కావాలి


ఈ విచిత్రమైన కుక్క ఆడాలనుకుంటుంది. జెనాన్ ఇప్పుడు మనల్ని డిక్ట్రిక్స్ దగ్గరకు తీసుకెళ్తుంది.
ఈ కాలర్‌తో వారి దాన్ని నియంత్రిస్తారు.


హుమ్.... నువ్వు కుక్క అయితే ఎలా ఉంటుంది?
వింతగా ఉంటుంది, కాని దానితో మన పని కావచ్చు.


రామ్ మామిడి-రుచిగల పాపిన్స్ తింటాడు
ఇవ్వనా? ఆకారాన్ని-మార్చేది


ఆకారాన్ని-మార్చేదానితో రామ్ జెనాన్‌గా మారుతాడు, ఇక శ్యామ్ అసలైన ఈల వేస్తాడు.


జెనాన్ శ్యామ్ దగ్గరకు రాగానే, దాని కాలర్ తీసి మరియు దాన్ని నాశనం చేస్తాడు
ఇక వారు నిన్ను ఎలా నియంత్రిస్తారో చూస్తా!


ఈ మధ్యలో, రామ్ జెనాన్‌లా భయంకరమైన విధంగా గ్రహాంతరవాసులు అనుసరించేలా చేస్తాడు.
హె ఇది పని చేయడం లేదు.
ఆఆఆర్! ఇది మనల్ని ఎటు కాకుండా చేస్తుంది


రామ్ గ్రహాంతరవాసులకు గుణపాఠం నేర్పాలనుకుంటాడు
మనం దాన్ని నియంత్రించలేకపోతే మనల్ని అదోగతి చేస్తుంది. డిక్ట్రిక్స్‌ని మరచిపోండి. ముందు మన ప్రాణాలను కాపాడుకుందాం.


పాపిన్స్ డిక్ట్రిక్స్‌ని కాపాడి, ఇంకా మనకు కొత్త పెంపుడు జంతువును ఇస్తుందని ఎవరికి తెలుసు! అది కూడా ఒకే రోజులో.
POPPINS

CHANDAMAMA CLASSICS and COMICS




# Catch the Action with Chandamama!




Follow the adventures of the unknown **Prince Arya** with his forest friends. Read the **legend of Garuda**, the invincible warrior. Solve mysteries in the jungle with super sleuths, **Eli and Puli**, of the Detective Duo intelligence agency.

Get your copies NOW!

Rs. 40

Rs. 60

Rs. 50




Chandamama subscribers buying all three titles will get a 20% discount

These titles are available only in English at selected book shops.

To place an order, contact: The Variety Book Depot AVG Bhawan, M-3 Connaught Circus, Po Box - 505, New Delhi - 110001 Ph: +91-11-23417175 / 23412567

సంపుటి: 62 డిసెంబర్ 2009 సంచిక: 12

పేరు................................................ వయస్సు .......

చిరునామా...........................................................

.........................................................................

.........................................................................

ఫోన్:................ ఇ-మెయిల్:..................................

## మీ మనసులో మాట చెప్పండి!

మీ అభిప్రాయాలను ఒక్కొక్క కథకు/శీర్షికకు నేరుగా ఉన్న గళ్ళల్లో టిక్ చేసి చుక్కలగీత గుండా కత్తిరించి మీ ఫీడ్‌బ్యాక్‌ను పోస్టు ద్వారా మాకు పంపండి.

| అత్యుత్తమం | ఉత్తమం | బావుంది | ఫరవాలేదు | మామూలు |
|---|---|---|---|---|
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |

చందమామ ఇండియా లిమిటెడ్,
2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్,
చిన్న నీలాంగరై, చెన్నయ్-600041.

T

## ఈ సంచికలో ...

### చందమామ

# అడుగు పెడుతూన్న 2010

ప్రియ మిత్రులారా!

ఈ సంవత్సరం చివరికి వచ్చేశాం. ఒక్కసారి వెనక్కు తిరిగి చూస్తే–కాలం ఎంత వేగంగా వెళుతోందో అర్థమవుతుంది! ఈ సంవత్సరారంభంలో అంటే, గత జనవరిలో మనం ఎన్నో నిర్ణయాలు తీసుకుని ఉంటాం. వాటిలో ఎన్నిటిని ఆచరించాం? ఎన్నిటిని సాధించాం? అని బేరీజు వేసుకుని చూసే సమయం ఇది. అనుకుని సాధించలేకపోయినవి కూడా చాలా ఉండవచ్చు...

అయినా, మనం అందుకు ఏమాత్రం నిరుత్సాహపడవలసిన అవసరం లేదు. మన లక్ష్యాలను సాధించడానికి మనం మనల్ని మరింత ఆయత్తపరచుకోవాలి. లోపాలను సరిదిద్దుకుని మరింత పట్టుదలతో, కృషిని కొనసాగించాలి. నిరంతరాయంగా కొనసాగే అభివృద్ధి 'కైజెన్' అనే భావన పలు జపాను కంపెనీలు ప్రపంచస్థాయి ఉన్నత ప్రమాణాలను అందుకోవడానికి ఎంతో దోహదపడింది. అలాంటి భావనల నుంచి మనం నేర్చుకోవలసినది ఎంతో ఉన్నది!

ఈ సంవత్సరారంభంలో మీరు తీసుకున్న నిర్ణయాలు, వాటిని సాధించిన విధానం, సాధించడంలో కలిగిన అంతరాయాలు, అంతరాయాలను అధిగమించి వాటిని సాధించడానికి ఇంకా ఏమేం చేయాలనుకుంటున్నారు? నూతన సంవత్సరారంభంలో తీసుకోనున్న సరికొత్త నిర్ణయాలు ఏమిటి? మొదలైన విషయాల గురించి మాకు రాయండి.

ఇక ఈ నెలలో వరల్డ్ ఎయిడ్స్ డే, సివిల్ ఏవియేషన్ డే, మానవ హక్కుల దినోత్సవం అంటూ అంతర్జాతీయ ప్రాముఖ్యతను సంతరించుకున్న పలు దినోత్సవాలు రానున్నాయి. అలాంటి ముఖ్యమైన విషయాలపై మనం చేపట్టవలసిన కార్యకలాపాలను, అనుదిన జీవితంలో మనం నెరవేర్చవలసిన బాధ్యతలను ఇవి గుర్తు చేస్తాయి! విశ్వ మానవప్రేమను ప్రబోధించిన యేసుక్రీస్తు జన్మదినమైన క్రిస్మస్ పర్వదినం నెలాఖరులో వస్తోంది. ఆనందప్రదమైన ఇలాంటి పర్వదినాలను అందరూ సమధికోత్సాహంతో జరుపుకోవడం మన ప్రత్యేకత!

నూతన సంవత్సరానికి మీరెలా స్వాగతం చెప్పదలుచుకుంటున్నారు? పాఠక మిత్రులందరూ తమతమ అనుభవాలను, కథలను, కవితలను, చిత్రాలను పంపి పత్రికకు ప్రత్యేక శోభను సమకూర్చగలరని ఆశిస్తున్నాం. మేమూ మావంతు నూతన సంవత్సర నిర్ణయాలు తీసుకుని, అంచెలంచెలుగా వాటిని అమలుపరుస్తూ, పాఠకుల విశేష ఆదరాభిమానాలను చూరగొనడంలో కృతకృత్యులు కాగలమని దృఢంగా విశ్వసిస్తున్నాం!

–సంపాదకుడు





డిసెంబర్ 2009 Rs. 20/-

***Founded by* B. Nagi Reddi and Chakrapani**

***Editor & Publisher :*** Prashant Mulekar
***Associate Editor :*** A.R. Balasubrahmanyam
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** T. Venkatesan
***Asst. Editor-Copy & Pre-Production :*** R. Sudha
***Creative Writer :*** R. Vaasugi, R. Rama
***Layout Designer :*** K. Narendra Raju
**Sanjay B Thorat : *Head - Sales and Circulation***
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Mobile +91 9821017787
email : sanjay.thorat@chandamama.com
**Rajendra K Jadhav : *Asst. Manager - Circulation***
Mobile +91 9320565048
email : rajendra.jadhav@chandamama.com
***New Delhi :* Sushil Sharma**
***Circulation Manager-North,***
**CHANDAMAMA INDIA LTD.,**
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
Mobile +91 99110 91022
***Bangalore :***
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
***Chennai :* K. Ravishankar, *Sales Officer - Circulation,*** Mobile +91 98414 00981
email : ravishankar.k@chandamama.com
***Business Development :* Ananth Prakash**
Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
***Content Head - Online :* Sowmya Bharadwaj**
email : online@chandamama.com
***Marketing Enquiries :***
email : marketing@chandamama.com
***Advertisement :***
email : sales@chandamama.com
***Subscription Queries:***
e-mail : subscription@chandamama.com
***Customer Cell :*** A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Production Executive :*** Panchakshari R Math
***Head Office :* CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, 2/513, Sundeep Avenue East, 2nd Main Road, Thiruvanmiyur, Chennai - 600 041. Editor : Prashant Mulekar


# పాఠకుల లేఖలు

చందమామ పత్రిక ధోరణి బాగానే ఉన్నా, మరిన్ని చేర్పులు ఉంటే బాగుంటుంది. ముఖ్యంగా భారత, రామాయణ ఇతిహాసాల నుంచి భాగాలు కథలుగా రావాలి. ఇంగ్లీషు, హైటెక్కు మేథ్స్‌లతో సతమతమవు తున్న పిల్లలకు ఇవి కొంత విశ్రాంతి, విజ్ఞానం, ఊరట కలిగిస్తాయి. పిల్లలకు కథల ద్వారానే ఎక్కువ ఆకర్షణ, శ్రద్ధ కలుగుతుంది. ఈ రకంగా కొంత తీరిక సమయం కల్పించు కుని పిల్లలకు చెప్పడానికి బాగుంటుంది. నిజానికి చందమామ వంటి పుస్తకాలు పిల్లలకోసమే కాదు; అవి ముందు పెద్దలకే అవసరం.

– *పి. జగన్నాథం, ఐఐటి కాన్పూరు*–***208016***

మామా! మారుతున్న కాలానికి అనుగుణంగా నువ్వు కూడా మారాలని ప్రయత్నిస్తున్నావు కదూ! కాని ఒక్కటి మాత్రం నిజం. ఈనాటి చాలా మంది 'టెక్నో పిల్లలు' జానపద లోకాలలో కాక–సాంకేతిక లోకాలలో విహరిస్తున్నారు. మరి వారికి అనుగుణంగా నువ్వూ మారాలని అనుకోవడం–పొరపాటు కాదేమో! కాని మామా! యాభై ఏళ్ళుగా నీతో చెట్టాపట్టాలేసుకుని తిరుగుతూ–నీ స్నేహమాధుర్యాన్ని అనుభవించినవాళ్ళం. మేము కూడా ఉన్నామని గుర్తుంచుకుంటావా? మమ్మల్ని కూడా అలరించాలని ప్రయత్నిస్తావు కదూ!

– *శివకుమార్, కొంపల్లి, ఒంగోలు*–***523002***

అరవై ఏళ్ళయినా చందమామలో ఏమాత్రం నాణ్యత తగ్గలేదు. కాని విమర్శకులు విమర్శిస్తూనే ఉంటారు. అదీ మంచికే. ఎందుకంటే ఇతర మ్యాగజైన్‌ల పక్కన చందమామ పున్నమి చంద్రుడిలా వెలుగుతోంది. అది వారు గ్రహించి పరీక్షించుకోవాలి. ఎన్నటికీ 'మేరా చందమామ మహాన్' అనాల్సిందే. – *శ్రద్ధ పులిజాల, హైదరాబాద్*

## ఎస్ఎంఎస్ ద్వారా

చిన్న కథల సంఖ్య పెంచండి. – *రవి, (ఆం.ప్ర)*

పాతికేళ్ళనాటి చందమామ కథలు ఎంతో ఆసక్తికరంగా బాగుండేవి.

– *జె.వి. జానకీదేవి, (ఆం.ప్ర)*



మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా, SMS MLANG <space> <Name, Age> <space> <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.

# శత్రుదళాల మధ్య పెల్లుబికిన ప్రేమ!

అది 1914వ సంవత్సరం. బెల్జియంలో మొదటి ప్రపంచయుద్ధం ఉధృతంగా జరుగుతూన్న రోజులు. ఆ ప్రాంతంలోని నేలంతా దట్టమైన మంచుతో కప్పబడి ఉన్నది. బ్రిటన్ మరియు జర్మన్ దళాలు ఆయా కందకాలలో పొంచి ఉన్నాయి. ఉభయుల కందకాల మధ్య దూరం కొన్ని వందల గజాలు మాత్రమే. జర్మన్ సైనికులు క్రిస్మస్ గీతాలు పాడడం విని, బ్రిటిష్ సైనికులు విస్మయం చెందారు! వాళ్ళు కందకాల నుంచి మెల్లగా తలలు పైకెత్తి తొంగి చూశారు. జర్మన్ సైనికులు క్రిస్మస్ చెట్టును దీపాలతో అలంకరించి ఉండడం కనిపించింది. యుద్ధరంగంలో ఎదురుచూడని అపూర్వ దృశ్యం!

బ్రిటిష్ సైనికులు హృదయాలలో ఉన్నట్టుండి ప్రేమ పెల్లుబకసాగింది. వాళ్ళు కూడా క్రిస్మస్ గీతాలు ఆలపించడం ప్రారంభించారు. త్వరలో ఉభయ సైనికులూ పరస్పరం స్నేహపూర్వకంగా శుభాకాంక్షలు తెలియజేసుకున్నారు. ఇరు పక్షాల సైనికులూ కాల్పులు జరపకూడదని అంగీకరించడంతో, సైనికులు కందకాల నుంచి ఒక్కొక్కరుగా వెలుపలికి దూకి వచ్చి–తమ దగ్గరున్న చాక్లెట్లు, జామ్, తినుబండారాలు పంచుకున్నారు. ఇరు పక్షాలకూ చెందని ప్రదేశంలో ఉభయపక్షాల సైనికులూ వింతైన ప్రేమపూర్వక వాతావరణంలో గుమిగూడారు!

ఆ ప్రత్యేక క్రిస్మస్ ప్రభావంతో కొత్తగా ఏర్పడిన మిత్రుల మీద ఆ తరవాత కూడా కాల్పులు జరపకూడదని నిర్ణయించారు. యుద్ధరంగంలో చోటు చేసుకున్న అసాధారణమైన అద్భుతం గురించి వివరిస్తూ, వందలాది సైనికులు తమ ఇళ్ళకు ఉత్తరాలు రాశారు. అన్నిటి కన్నా ముఖ్యమైన విశేషం ఏమంటే–సైనికులు అంతవరకు శత్రువులుగా భావించిన వారిలో ఆ క్షణం నుంచి మనుషులను చూడగలిగారు!

ప్రపంచ యుద్ధమూ–క్రిస్మస్ ఏదో ఒక రోజున చేతులు కలపగలవని ఎవరు మాత్రం ఊహించి ఉంటారు? ఒక మంచి పండుగ మంచి మార్పును తీసుకురాగలదో చెప్పడానికి ఇదొక అద్భుతమైన ఉదాహరణ!

అందరికీ ఆనంద క్రిస్మస్ శుభాకాంక్షలు!





Cycle సైకిలు साइकिल Hindi సాయికిల్

# సింహంతో స్నేహం

హిమాచల్‌ప్రదేశ్ లాహువాల్ స్పిటి అందమైన కొండ సానువుల మధ్య ఉన్న ఒక చిన్న గ్రామంలో గద్దీ తెగ ప్రజలు నివసించేవారు. ఆ గ్రామంలో రాంచెన్ అనే యువకుడు ఉండేవాడు. అతడి కళ్ళు ఎప్పుడూ ఆనందంతో మిలమిలా మెరుస్తూ ఉండేవి. అతడు మధురమైన కంఠస్వరంతో జానపద గీతాలు ఉత్సాహంతో పాడేవాడు. అతడి పాటలు వినడానికి గ్రామస్థులు ఎంతో ఇష్టపడేవాళ్ళు.

ఆ గ్రామస్థులందరికిలాగే రాంచెన్‌కు సొంతంగా చిన్నపాటి గొర్రెల మంద ఉండేది.



వాటి నుంచి తీసే ఉన్నిని అమ్మి, కూడూ గుడ్డా సమకూర్చుకునే వాడు. చిన్న గుడిసె, రెండు వెచ్చటి ఉన్ని చొక్కాలు, దుప్పట్లు, ఆహారానికి సరిపడా సొట్టు ధాన్యం. ఇవే అతడికున్న ఆస్తి పాస్తులు. ఉన్నంతలో తృప్తిగా, సంతోషంగా కనిపించేవాడు.

అదే గ్రామంలో వాంగూ అనే మరొక పెద్ద మనిషి ఉండేవాడు. జీవితావసరాలకు సరిపడా అతనికి అన్నీ ఉన్నా, ఎప్పుడూ విచారంతో కని పించేవాడు. మరిన్ని గొర్రెలు ఉంటే, మరింత ఉన్నీ, మరింత డబ్బూ వచ్చేది కదా అని తెగ బాధపడిపోయేవాడు. తనకన్నా ఎక్కువ ఉన్న వాళ్ళను చూసి అసూయతో దహించుకుపోయే వాడు. ఎవరైనా సంతోషంగా, సుఖంగా కని పిస్తే రుసరుసలాడేవాడు. ఆ ఏడుపుగొట్టు మనిషిని చూస్తే ఊళ్ళో ఎవరికీ ఇష్టం ఉండేది కాదు.

రాంచెన్ రోజూ గ్రామానికి సమీపంలో ఉన్న చిన్న కొండమీదికి గొర్రెలను మేపడానికి తోలుకు పోయేవాడు. ఒకనాడు అక్కడ అతనికి అంతగా గడ్డి కనిపించలేదు. కొద్ది దూరంలో పొలం నిండుగా పచ్చలు ఆరబోసినట్టు పచ్చటి గడ్డి అతడి దృష్టిని ఆకర్షించింది.

రాంచెన్ గొర్రెలను అక్కడికి తోలుకు వెళ్ళాడు. ఏపుగా పెరిగిన నవనవలాడే పచ్చటిగడ్డిని చూడ గానే గొర్రెలు గెంతులు వేస్తూ మేయసాగాయి. రాంచెన్ వాటిని అక్కడే వదిలి తను కాస్త ముందుకు వెళ్ళి చూడాలనుకున్నాడు. కొంత



Cycle సైకిలు மிதிவண்டி Tamil మిదివండి



దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా పక్కనే సింహం కనిపించేసరికి భయంతో వణికిపోయాడు. కాని వెంటనే తేరుకున్నాడు. ఎందుకంటే, అది నిజమైన సింహం కాదు. సజీవంగా ఉన్న సింహంలా కనిపించే రాతిశిల్పం!

ఆ ప్రాంతాన్ని రక్షిస్తున్నట్టు ఒంటరిగా, గంభీరంగా ఉన్న ఆ సింహాన్ని చూడగానే రాంచెన్‌కు దానిపట్ల అభిమానం పుట్టుకువచ్చింది. మెల్లగా దాని దగ్గరికి వెళ్ళి స్పృశించి చూశాడు. అది తనకెంతో కాలంగా పరిచయమున్నట్టు చేతులతో చుట్టేసి ఆప్యాయంగా పలకరించాడు. తనతో తెచ్చుకున్న సాట్టు ధాన్యాన్ని దాంతో పంచుకున్నాడు.

సాయంకాలమై ఇంటికి తిరిగి వెళ్ళేప్పుడు అతడి మనసు ఆనందంతో నిండిపోయింది. ఈ రోజు తన గొర్రెలు మేయడానికి కొత్త పచ్చిక ప్రాంతంతో పాటు, తనకో మంచి నేస్తం దొరికిందని పొంగిపోయాడు. మరుసటిరోజు నుంచి అక్కడికి వచ్చినప్పుడల్లా సింహంతో మాట్లాడేవాడు. ఆడుతూ పాటలు పాడి వినిపించేవాడు. తను తెచ్చుకున్న సాట్టులో కొంచెం సింహం ముందు ఉంచేవాడు. మరుసటి రోజు వచ్చి చూస్తే అది కనిపించేది కాదు. ఏ పక్షులో వాటిని తిని ఉంటాయని అతనికి తెలుసు. అయినా, తన సింహం నేస్తమే ఒక గుటకతో దాన్ని మింగేసినట్టు ఊహించుకుని సంతోషించేవాడు!

మరికొన్నాళ్ళకు శీతాకాలం ఆరంభమైంది. ఎండలో వేడి తగ్గి పోయింది. రాత్రుల్లో చలి బాగా పెరిగిపోయింది. గ్రామస్థులందరూ కిందికి దిగి కులూ లోయలో చలి తక్కువగా ఉన్న మరో ప్రాంతానికి వెళ్ళడానికి ఆయత్తమవుతున్నారు. తను కూడా వాళ్ళతో వెళ్ళాలని రాంచెన్ నిర్ణయించాడు. అయితే వెళ్ళే ముందు ఒకసారి తన నేస్తం రాతి సింహాన్ని చూసిరావాలనుకున్నాడు.

మరునాడే దాని దగ్గరికి వెళ్ళి, ''నేను అందరితో కలిసి వెళ్ళిపోక తప్పదు. నువ్వు జాగ్రత్తగా ఉండు. అవునూ... నేను వెళ్ళడం నీకు అంతగా ఇబ్బంది.కలిగించదనుకుంటాను. నేను లేదనే బాధ లేదు కదూ!'' అంటూ నవ్వాడు రాంచెన్. వెంటనే సింహం నోరు తెరిచి, ''లేదు. నువ్వు రాకపోవడం నాకు చాలా బాధ కలుగుతోంది,'' అని గర్జించింది. ''నీకు నేనొక కానుక ఇవ్వాలనుకుంటున్నాను. రేపు సూర్యోదయం కల్లా ఒక సంచీతో వచ్చి, నా నోట్లో ఉన్నదాన్ని తీసుకుని వెళ్ళు,'' అన్నది సింహం.

''నాకు అన్నీ ఉన్నాయి,'' అని అతడు ఎంత చెప్పినా సింహం వినిపించుకోలేదు. తప్పక వచ్చి తీరాలన్నది.

మరునాడు వేకువజామున నిద్ర లేచిన రాంచెన్, రాతి సింహం మాటలు జ్ఞాపకం వచ్చి



Cycle సైకిలు সাইকেল Bengali సాయికేల్

దాని వద్దకు పరిగెత్తాడు. ఆ హడావుడిలో సంచీ తీసుకు వెళ్ళడం మరిచిపోయాడు. సింహం అతడి రాక కోసం ఎదురు చూస్తున్నది. రాంచెన్ సింహం నోట్లో చేయి పెట్టి, అందులో దొరికిన చిన్నచిన్న రాతి ముక్కలను తీసి తన టోపీలో నింపుకున్నాడు. సూర్యోదయం కాగానే సింహం నోరు మూసుకుపోయింది. టోపీలోని రాళ్ళ కేసి చూసిన రాంచెన్‌కు సంభ్రమాశ్చర్యాలు కలిగాయి. అవన్నీ బంగారు ముక్కలు! ఉరుకులు పరుగులతో గ్రామం చేరిన రాంచెన్, ఆ విషయం గురించి ఎదురైన ప్రతి ఒక్కరికీ సంతోషంగా చెప్పసాగాడు.

రాంచెన్‌కు పట్టిన అదృష్టం చూసి గ్రామస్థులందరూ సంతోషించారు. వాంగూ మాత్రం అసూయతో అదెలా సాధ్యమయిందో ఆరా తీశాడు. వివరాలు తెలిశాక, తనూ సింహంతో స్నేహం చెయ్యాలనుకున్నాడు. మీగడ పాలు, తేనె, మంచి సొట్టు తీసుకుని వెళ్ళి దానికి ఇచ్చాడు. వింజామరతో విసురుతూ గంటల తరబడి దాంతో మాట్లాడుతూ దానిపక్కనే కూర్చున్నాడు.



ఆఖరికి సింహం జాలిపడి అతడికి కూడా కానుకలిస్తాననీ, సూర్యోదయం కల్లా వచ్చి తీసుకోమనీ చెప్పింది. సంతోషంగా ఇంటికి తిరిగి వచ్చిన వాంగూ రాత్రంతా కంటిమీద రెప్ప వేయలేదు. మూడోజాము ముగియక ముందే పెద్ద సంచీతో బంగారం ఖజానాను తరలించుకు రావాలని లాంతరు తీసుకుని బయలుదేరాడు.

చుట్టూ ఎటుచూసినా చిమ్మచీకటి. మంచుతో ముద్దగా తడవడం వల్ల దారి జారుతూ ఉంది. అయితే, వాంగూ వాటన్నిటినీ పట్టించుకోకుండా వేగవేగంగా అడుగులు వేస్తూ నడవసాగాడు. ఆఖరికి రాతి సింహం దగ్గరికి చేరాడు. తెరుచుకుని ఉన్న సింహం నోట్లో ఎంత బంగారం ఉందో చూడాలన్న ఆత్రం కొద్దీ కాస్త దూరం నుంచే తొంగి చూడబోయాడు. దాంతో కాలుజారి కింది అగాథంలోకి పడిపోయాడు. చేతిలోని లాంతరు ఎక్కడో ఎగిరిపడి ముక్కలు ముక్కలైపోయింది. తీవ్రంగా గాయపడలేదు గానీ, లోయకు దూరంగా పోయి పడి మతిస్థిమితం కోల్పోయాడు. వాంగూకు ఏమయిందో గ్రామస్థులెవరికీ తెలియలేదు. రాంచెన్ మాత్రం ఎప్పటిలాగే సంతోషంగా జీవించాడు.

రాతిసింహం వింత చిరునవ్వుతో ఆ ప్రాంతాన్ని చూస్తూనే ఉన్నది!



Cycle సైకిలు सायकल Marathi సాయ్‌కల్

## బేతాళ కథలు

# ఆహ్వానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ‘‘రాజా, సంకల్పించే ఘనకార్యాలు సాధించడానికి ఆత్మవిశ్వాసం ప్రధానం అన్నది అందరికీ తెలిసినదే. ఆత్మవిశ్వాసం పేరుతో కొందరు లేనిపోని అహంకారం పెంచుకుంటారు. అహంకారం అనర్థహేతువని తెలిసినా దాని నుంచి బయటపడడం అందరికీ సాధ్యం కాదు. పాలకులలో అహంకారం బాహాటంగా కనిపిస్తుంది. పండితులనుకునే వారిలో ఇది పైకి కనిపించకపోయినా, అంతరాంతరాలలో బుసలు కొడుతూనే ఉంటుంది. నీలో అలాంటి అహంకారం తలెత్తకుండా ఉండేందుకు తగు హెచ్చరికగా మాతంగుడనే పండితుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,’’ అంటూ ఇలా చెప్పసాగాడు:

మాలికాపురంలో ఉండే మాతంగుడు, మదనుడు కలిసి చదువుకున్నారు. మాతం



గుడు మహాపండితుడై ఎక్కడెక్కడి పండిత సభలలో తన ప్రతిభ చాటి ఊరికి పేరు తెచ్చాడు. ఆయన తమ ఊరివాడని గ్రామస్థులు గర్వపడతారు. మాతంగుడికి గర్వం లేదు కానీ, ఆత్మాభిమానం ఎక్కువ.

మదనుడికి సరిగ్గా చదువబ్బక వ్యవసాయం మీద దృష్టి పెట్టి గొప్పగా రాణించాడు. ధనం ఎంత గడించినా మాతంగుడిలా తనకు పేరు ప్రతిష్ఠలు లేవని ఆయనకు అసూయ.

ఇలా ఉండగా ఆ దేశపు రాజు, రాజధానిలో పండిత సభలు ఏర్పాటు చేసి, దానికి మాతంగుణ్ణి ఆహ్వానిస్తూ మాలికాపురానికి రథం పంపాడు. మాతంగుడు రాజధానికి వెళ్ళాడు.

అది ఆ ఊరికే విశేషం. అందుకని గ్రామాధికారి గ్రామస్థుల్ని రచ్చబండవద్ద సమావేశపరచి, తిరిగి వచ్చాక మాతంగుణ్ణి సత్కరించడానికి అందరి సలహా, సహాయ సహకారాలు కోరాడు.

ఇది నచ్చని మదనుడు, ''పాండిత్యమైనా ఏ వినోదమైనా కడుపు నిండాకనే! కడుపు నిండాలంటే రైతు పగలనకా రాత్రనకా పొలంలో కష్టపడాలి. కానీ జనం రైతు గొప్పతనాన్ని గుర్తించకుండా-పండితుల్నీ, కళాకారుల్నీ పొగుడుతూంటారు. జనం పొగిడేసరికి వాళ్ళు కూడా అదే నిజమనుకుని అహంకారంతో విర్రవీగుతుంటారు,'' అన్నాడు.

అయితే, మదనుడి అభిప్రాయాన్ని ఒక్కరూ సమర్థించలేదు. పైగా మాతంగుణ్ణి వినయశీలి అని మరింత మెచ్చుకోసాగారు. దాంతో మదనుడు మాటమార్చి, ''మాతంగుణ్ణి ఎలా సత్కరించాలని కదా ఈ సమావేశం! ఆ ముచ్చట ఒక్క రోజులోనే అయిపోకూడదు. గ్రామస్థులం ఎవరికి వారు రోజుకొకరు చొప్పున ఆయన్ను ఇంటికి పిలిచి విందు భోజనం పెడితే-సన్మానం కలకాలం కొనసాగుతుంది,'' అన్నాడు.

గ్రామాధికారితో సహా అందరికీ ఈ సలహా నచ్చి, మదనుణ్ణి మెచ్చుకున్నారు. మదనుడి ఆలోచన వేరు. పదిమందిలో చూపని అహంకారం-విడివిడిగా ఒక్కో ఇంటికే వెడితే బయటపడి మాతంగుడి విషయంలో తను చెప్పిందే నిజమని అంతా గ్రహిస్తారని ఆయన నమ్మకం.

రాజధాని పండితసభల్లో మాతంగుడికి ఘనసన్మానం జరిగింది. రాజాయనకు విలువైన కానుకలిచ్చి తిరుగుప్రయాణానికి రథం



Cycle సైకిలు ಸೈಕಲ್ಲು Kannada సైకల్లు



ఏర్పాటు చేశాడు. అయితే, ఆ సభలకు వివిధ ప్రాంతాలనుంచి వచ్చిన మాతంగుడి బంధుమిత్రులు తిరుగు ప్రయాణంలో తమ ఇళ్ళకు రావలసిందిగా ఆయనన్ను కోరారు. అందుకని మాతంగుడు తనకు రథం వద్దని రాజుకు చెప్పాడు.

మాతంగుడు వరుసగా బంధుమిత్రులు ఒక్కొక్కరి ఆహ్వానాన్ని మన్నిస్తూచివరికిమాలికా పురానికి ప్రయాణమై అడవిలో మార్గమధ్యంలో ఒక చెట్టుకింద విశ్రమించాడు. ఇద్దరు దొంగలు ఆయన ముందుకొచ్చి, ''నీ దగ్గిర విలువైనవి ఏమున్నాయో-అన్నీ మాకిచ్చెయ్,'' అంటూ కత్తులు ఝుళిపించారు.

మాతంగుడు తడబడ లేదు. ''నా దగ్గిర మన రాజు ఇచ్చిన కానుకలున్నాయి. నా పాండిత్యాన్ని మెచ్చి ఇవ్వడం వల్ల ఇవి నాకు విలువైనవి. వీటిని మీకివ్వలేను. వీటిని మీరు బలవంతంగా తీసుకున్నా-ఇప్పుడు మీరు నన్ను దోచినట్లే రేపు మరొకరు మిమ్మల్ని దోచుకు పోగలరు. ఎవరూ దోచలేని విద్యాధనం వీటికంటే విలువైనది. అది నేను మీకివ్వగలను. అందుకు మీరు నాతో వచ్చి కొన్నాళ్ళు నాకు శిష్యరికం చేయాలి. ఇష్టమైతే నాతో రండి,'' అన్నాడు.

దొంగలు చిరాకుపడి, ''నీలా చదువుకోక పోయినా, నీ మాటలు నమ్మి నీతో వచ్చేటంత వెర్రివాళ్ళం కాము. మర్యాదగా నీ దగ్గిరున్న డబ్బు తీసి మాకియ్యి,'' అని హుంకరించారు.

అంతలో ఆ చెట్టుమీది నుంచి ఒక రాక్షసుడు కిందికి ఉరికి దొంగల్ని భయపెట్టి తరిమేశాడు. ఆశ్చర్యంగా తననే చూస్తున్న మాతంగుడితో, ''అపూర్వమైన నిగ్రహంతో తపస్సు చేసిన జనదీపుడనే నేను, అహంకారం కొద్దీ ఒక మహాత్ముడి శాపానికి గురై ఇలా రాక్షసుణ్ణయ్యాను. అహంకారం లేని వ్యక్తి దీవెనలతోనే నాకు శాపవిముక్తి. నువ్వు మహా పండితుడివి. పండితులకు అహంకారముండదు. నీ రాకతో ఏళ్ళ తరబడి నా నిరీక్షణ ఫలించింది. నన్ను దీవించి శాపవిముక్తి ప్రసాదించు,'' అన్నాడు రాక్షసుడు.

అప్పుడు మాతంగుడాయనకు తన పూర్తి వివరాలు చెప్పి, ''అహంకారం లేదనడం కూడా అహంకారమే! కాబట్టి నిన్ను దీవించలేను. అహంకారి కాని వ్యక్తిని గుర్తించడం ఎలాగో తెలిస్తే చెప్పు. నీకు సాయపడడానికి ప్రయత్నిస్తాను,'' అన్నాడు.



Cycle సైకిలు ସାଇକେଲ Oriya సాయ్‌కేల్



జనదీపుడాయన్ను మెచ్చుకుని, ''నువ్వు అహంకారివి కావని నీ మాటలే చెబుతు న్నాయి,'' అంటూ ఆయనకో ఎరుపు రాయి ఉంగరాన్నిచ్చి, ''అహంకారుల వేలికి పెడితే ఈ రాయి ఎర్రగా కనిపిస్తుంది. అహంకారి కానివాడు ధరించగానే ఈ రాయి నీలంగా మారిపోతుంది,'' అన్నాడు.

మాతంగుడా ఉంగరం ధరించగానే దాని రాయి నీలంగా మారిపోయింది. జనదీపుడు సంబరపడ్డాడు కానీ మాతంగుడు మాత్రం, ''రాజసన్మానం అందుకుని ఇప్పుడే మా ఊరెళుతున్నాను. నేనంటే గ్రామస్థులకు ఎంతో అభిమానం. వాళ్ళు నన్ను పొగిడిన ప్పుడు నా అంతటివాడు లేడన్న అహంకారం నాలో రేగే అవకాశముంది. అలా జరక్కపోతే నేను ఇక్కడికి తప్పకుండా తిరిగి వచ్చి నిన్ను దీవించగలను,'' అన్నాడు. జనదీపుడు సరే నన్నాడు.

మాతంగుడు మాలికాపురం చేరుకోగానే గ్రామస్థులాయనకు ఘనస్వాగతం పలికారు. గ్రామాధికారితో సహా ఊరి పెద్దలందరూ ఒక్కొక్క రోజుకు ఒక్కొక్కరు చొప్పున విందుకు ఆప్యాయంగా ఆహ్వానించారు. మదనుడు కూడా ఆయన్ను వీలు చూసుకుని ఒకరోజు తన ఇంటికి రావలసిందిగా చెప్పాడు.

మాతంగుడు అందరిళ్ళకూ వెళ్ళాడు కానీ, మదనుడింటికి వెళ్ళలేదు. అది సాకుగా చేసుకుని, ''ఇదీ మాతంగుడి అసలు రంగు. ఊరి పెద్దలు పిలిస్తే చక్కగా వాళ్ళిళ్ళకు వెళ్ళి భోంచేసి వచ్చాడు. నేను పిలిచినా రాలేదు. రైతులంటే ఆయనకు చిన్నచూపు,'' అంటూ దుష్ప్రచారం మొదలుపెట్టాడు.

గ్రామస్థులకు మాతంగుడంటే గౌరవముం డడంవల్ల ఈ విషయమై ఎవరూ ఆయన్ను ఎదుటపడి అడగలేదు. నిజానిజాలు నిరూ పించాలని ఆయనపట్ల అపరిమిత అభిమానం గల రంజనుడనే పేద రైతు మరుసటి దినం తన ఇంటికి విందుకు పిలిచాడు. మాతం గుడు అతడింటికి సంతోషంగా వెళ్ళివచ్చాడు. అది తెలిసి మరికొందరు పేదలాయన్ను విందుకు పిలిచారు. మాతంగుడు అందరి ఆహ్వానాల్నీ మన్నించాడు.

మదనుడి ఆరోపణ తప్పని తేలిపోయింది. కానీ ఆయన ఊరుకోకుండా, ''మాతంగుడు తనకంటే తక్కువవారితోనే తప్ప అధికులైన వారితో కలవలేదు. చేతిలో అధికారముంది



Cycle సైకిలు સાયકલ Gujarati సాయ్‌కల్

కాబట్టి ఊరి పెద్దలను ఆయన కాదనలేడు. తనకంటే ఆస్తిపరుణ్ణి గనక, ఆయనకు నేనంటే అసూయ. అసూయకు కారణం అహంకారమని వేరే చెప్పాలా?'' అన్నాడు.

ఇది గ్రామాధికారికి తెలిసింది. ఆయన ఊరుకోలేక మాతంగుణ్ణి కలిసి జరిగింది చెప్పి, ''నువ్వు అహంకారినని ఒప్పుకో. లేదా ఎలాగైనా మదనుడి నోరు మూయించు,'' అన్నాడు.

మాతంగుడాయనకు జనదీపుడి కథ చెప్పి, ''నా వేలిన ఉన్న ఉంగరపు రాయి ఇంత వరకూ ఎర్రగా మారలేదు. ఐనా నేను అహంకారినని ఒప్పుకునేందుకు అభ్యంతరం లేదు. ఈ ఉంగరం సాయంతో మన గ్రామంలో అహంకారి కాని ఒక వ్యక్తిని గుర్తించడానికి ఒప్పుకుంటే చాలు. ఆ వ్యక్తి దీవెనతో జనదీపుడికి శాపవిమోచనం కలిగించాలన్నదే నా

నవంబర్'09 బే.క. 'మూడు తలల రాక్షసుడు'
ఆధారం: ఎస్. శివనాగేశ్వరరావు రచన

ఆకాంక్ష,'' అన్నాడు. గ్రామాధికారి ఆశ్చర్యంగా, ''ఇలాంటి ఉంగరం దగ్గిరుంచుకుని ఇంకా జాప్యం చేస్తావేం? పద గ్రామస్థులందర్నీ సమావేశపరుద్దాం,'' అన్నాడు.

గ్రామాధికారి ఊరందర్నీ సమావేశపరిచి విషయం చెప్పాడు. మదనుడితో సహా గ్రామస్థులందరూ ఒక్కొక్కరుగా ఆ ఉంగరాన్ని ధరిస్తే రాయి ఎరుపు రంగుకు మారింది. ఒక్క మాతంగుడు ధరించినప్పుడే అది మళ్ళీ నీలంరంగుకు మారింది.

ఉంగరం మహిమను అంతా ఒప్పుకున్నారు. మదనుడు మాత్రం, ''అందరి పిలుపులూ మన్నించిన మాతంగుడు నా పిలుపు మన్నించలేదు. నా ఇంటికి విందుకు రాలేదు.





Cycle సైకిలు চাইকেল Assamese సాయికేల్

అతడు అహంకారి కాదంటే నేనొప్పుకోను. ఈ ఉంగరంలో ఏదో మోసముంది. మాతంగుడు చెప్పింది కట్టుకథ అని నా అనుమానం,'' అన్నాడు.

మాతంగుడు తన మాట నిరూపించడానికి మదనుణ్ణి తనతోపాటు అడవికి తీసుకెళ్ళాడు. అక్కడ ఆయన రాక్షసుణ్ణి దీవించగానే శాప విముక్తి పొంది మునిగా మారిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఎంత పిలిచినా, మదనుడి ఇంటికి విందుకు వెళ్ళని మాతంగుడి మనసులో అహంకారం దాగి ఉందని తెలుస్తూనే ఉన్నది కదా? మరి, అలాంటి అహంకారి దీవిస్తే రాక్షసుడికి శాప విముక్తి ఎలా కలిగింది? మాతంగుడు మదనుడి ఇంటికి వెళ్ళకపోవడానికి వేరేదైనా కారణం ఉన్నదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''నిజమైన పండితులకు అహంకారం ఉండదు. మాతంగుడు అసలు సిసలు పండితుడు. ఆ కారణంగానే రాజు సన్మానించినా, బంధుమిత్రులు, ఊరి ప్రజలు అభిమానించినా ఆయనలో అణు మాత్రం అహం కూడా పెరగలేదు. ఇక మదనుడి ఇంటికి విందుకు వెళ్ళని విషయానికి వస్తే–మాలికాపురంలో అందరూ ఆయన్ను తమ ఇళ్ళకు విందుకు ఆహ్వానించారు. అయితే, మదనుడు మాత్రం విందుకు వీలు చూసుకుని రమ్మన్నాడే తప్ప, ఫలానా రోజని చెప్పలేదు. అంటే ఆ పిలుపులో చిత్త శుద్ధి లేదు. ఆత్మాభిమానం ఉన్నవారెవరూ విందుకు అలాంటి ఆహ్వానాన్ని మన్నించరు. ఏ రోజో చెప్పమని అడగనూ అడగరు. మాతంగుడు కూడా ఆత్మాభిమానం కలవాడు గనక అలాగే చేశాడు. మాతంగుడిది అహంకారం కాదు, ఆత్మాభిమానం. అందుకే ఆయన దీవెనతో రాక్షసుడికి శాపవిముక్తి కలిగింది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. –(కల్పితం)

*[ఆధారం: ''వసుంధర'' రచన]*





11

# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

చిత్రాలు: గాంధి అయ్య

కనిపించకుండా పోయిన పిల్లలలో ఒకడు అడవిలో ఆర్యకు ఎదురువెళ్ళి, ఆర్యను రప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్న ధర్మపిత వద్దకు అతణ్ణి తీసుకువెళ్ళాడు.


సువర్ణద్వీపంలోని మాణిక్యం గురించిన పూర్వగాథ నువ్వు తప్పక వినే ఉంటావు?
అవును...
నా వంశానికి ఉన్న మంచి పేరును కళంకపరిచాను. నేను నా ప్రాణాలు తీసుకుంటాను.
ఎవరక్కడ? ఎదుటికిరా...
నీ ప్రాణాలు తీసుకున్నంత మాత్రాన పోయిన మాణిక్యం తిరిగి వస్తుందా?
నేనే మాణిక్యం సంరక్షకుణ్ణి.
మాణిక్యం ఇంకా ఒక మరేకుడి ఆధీనంలోనే ఉన్నది. అందువల్లనే నేను నిన్ను వదులుకోలేదు.
ఒక మరేకుడా! నా తెగకు చెందిన వాడే దాన్ని దొంగిలించాడా?
అవును. మాణిక్యం ఆధీనంలో ఉన్నవారిని అది కాపాడాలంటే దాన్ని రక్తంతో సాధించాలి! ఆ సంగతి నీకు తెలుసు.


అంటే, దానిని
కాజేసిన పిరికివాడికి దానివల్ల
ఎలాంటి ప్రయోజనమూ
లేదన్నమాట?
వాడు దాని రహస్యాలను
కనుగొనలేదు. వాడు దాన్నొక
ప్రాణి కడుపులో దాచాడు.
అప్పుడు నేను
దాన్ని వేటాడి
సాధిస్తాను.
మరీషా ఆడతోడేలు
రూపం ధరించి తన పనిని
మొదలు పెట్టింది.
ఆమె వేటాడి
చంపిన జంతువుల
ఎముకలు ఇవి!
.... అయితే ఆమె
సాధించలేదు.
ఆమె
సాధించలేదు.


ఆ కథ మరోసారి చెబుతాను రాజా!
ఆమెకెందుకు సాయపడాలని అనుకుంటున్నావు?
ఇప్పుడు నువ్వు బాగా అలిసిపోయి ఉంటావు. కాస్సేపు విశ్రాంతి తీసుకో.
మీరు నాకు రక్షణ కల్పిస్తారా?
అవును రాజా.
నా ప్రాణరక్షణకు పిల్లలు కావలసినంత బలహీనుడినైన రాజునా నేను?
ప్రపంచాన్ని విషాదం నుంచి కాపాడేది పిల్లలే. నమ్మకాన్ని పరిహసించకు రాజా!
(ఇంకావుంది)



# రామాయణం

## యుద్ధ కాండ-12

రాముడి దెబ్బకు తట్టుకోలేక రావణుడు పారిపోయాడు. తరవాత రాముడు లక్ష్మణుడు పడిఉన్న చోటికి వచ్చి, ఊపిరి బరువుగా తీస్తూ కొస ప్రాణంతో ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అధైర్యపడిపోయాడు. లక్ష్మణుడికి ప్రాణభయం ఉండదని సుషేణుడు రాముడికి ధైర్యం చెప్పి, హనుమంతుడితో, ''జాంబవంతుడు చెప్పిన ఓషధి పర్వతానికి వెళ్ళి, దాని దక్షిణ శిఖరం పైన ఉండే నాలుగు రకాల ఓషధులూ తీసుకురా,'' అన్నాడు.

హనుమంతుడు ఓషధీ పర్వతం దగ్గరికి వెళ్ళాడు. కాని ఆ ఓషధులేవో అతనికి తెలియలేదు. అందుచేత అతను మొత్తంగా శిఖరాన్నే తీసుకు పోదామనీ, లక్ష్మణుడికి కావలిసిన ఓషధి ఆ శిఖరం మీద ఎక్కడో ఉండక పోదనీ అనుకున్నాడు. అతడాపర్వత శిఖరాన్ని మూడు సార్లు అటూ ఇటూ కుదిలించి, పెకలించి తీసుకుపోయి యుద్ధభూమిలో వాలి, ''నువ్వు చెప్పిన మూలికలు గుర్తు తెలియక శిఖరాన్ని మొత్తంగా పెరికి తెచ్చాను,'' అని సుషేణుడితో చెప్పాడు.

సుషేణుడు తనకు కావలిసిన ఓషధిని పెల్లగించి, నలిపి, దాని రసాన్ని లక్ష్మణుడి ముక్కులో పిండాడు. దాని వాసన తగలగానే లక్ష్మణుడు లేచి కూర్చున్నాడు. రాముడు తన తమ్ముణ్ణి ఆలింగనం చేసుకుని ఆనంద బాష్పాలు రాలుస్తూ, ''లక్ష్మణా, నా అదృష్టం కొద్దీ నువ్వు వచ్చి మళ్ళీ బతికావు. నువ్వే పోయివుంటే నాకు సీత దేనికి! యుద్ధంలో విజయం దేనికి?'' అన్నాడు.






Cycle సైకిలు ᱥᱟᱭᱠᱤᱞ Santali దులుం



అది విని లక్ష్మణుడు, ''బలహీనుడి లాగా ఎందుకిలా మాట్లాడతావు? రావణుణ్ణి చంపి విభీషణుడికి పట్టం కడతానని ఇచ్చిన మాట నిలబెట్టుకోవద్దా? నా కోసం దిగులు పడి నిరాశ చెందక, రావణుణ్ణి యుద్ధంలో చంపెయ్యి,'' అన్నాడు.

లక్ష్మణుడిలా అనగానే రాముడు స్థిర చిత్తుడై విల్లు చేతబట్టాడు. రావణుడు కూడా మరొక రథమెక్కి యుద్ధసన్నద్ధుడై వచ్చాడు. రాముడు నేలపైనా, రావణుడు రథం లోనూ ఉండి యుద్ధం ప్రారంభించారు.

అంతలో ఇంద్రుడి సారథి అయిన మాతలి దేవలోకం నుంచి ఒక దివ్యమైన రథాన్నీ, కవచాన్నీ, విల్లునూ, బాణాలనూ, శక్తినీ తీసుకుని రాముడున్న చోటికి వచ్చి, ''రామా, దేవేంద్రుడు నీకోసం వీటినన్నిటినీ పంపాడు. ఈ రథంలో ఎక్కి నువ్వు రావణుణ్ణి వధించు,'' అని చెప్పాడు. రాముడా రథానికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి అందులో ఎక్కాడు.

ఇద్దరూ ఒకరిపై ఒకరు మహాస్త్రాలు ప్రయోగించుకున్నారు. ఒకరి అస్త్రాలను మరొకరి అస్త్రాలు నిర్వీర్య పరచాయి. కొంత సేపు రావణుడు అతి భయంకరంగా యుద్ధం చేసి, రాముడికి చెయ్యీ కాలూ ఆడకుండా చేశాడు. అతడు వజ్రాయుధంతో సమానమైన ఒక శూలాన్ని రాముడిపై ప్రయోగించే సరికి, రాముడు దాన్ని తన బాణాలతో నిరోధించ లేక, ఇంద్రుడు పంపిన శక్తిని ప్రయోగించి ఆ శూలాన్ని ధ్వంసం చేశాడు.

ఆ తరవాత రాముడు విజృంభించి యుద్ధం చేస్తూంటే రావణుడు ఉక్కిరి బిక్కిరి అయి ఆత్మరక్షణ కూడా చేసుకోలేని స్థితిలో పడ్డాడు. అది చూసి రావణుడి సారథి తమ రథాన్ని యుద్ధరంగం నుంచి అవతలికి తోలుకు పోసాగాడు. రావణుడికి తన సారథిపైన ఆగ్రహం వచ్చింది. ''ఓరీ దుర్బుద్ధీ, నేను పిరికివాణ్ణా, అసమర్థుణ్ణా, అస్త్రాలు లేని వాణ్ణా, యుక్తిలేనివాణ్ణా? ఏమనుకుని నీ ఇష్టం వచ్చినట్టు రథాన్ని యుద్ధరంగం నుంచి తోలుకు పోతున్నావు? నా కీర్తి కాస్తా ధ్వంసం చేశావే! వెంటనే రథాన్ని వెనక్కు తోలు,'' అన్నాడతను తన సారథితో.

''మహారాజా, నీ మేలు కోరి, నా విధిని పాటించి రథాన్ని పక్కకు తెచ్చాను. రాముడు చేసేయుద్ధానికినువ్వు ప్రతియుద్ధం చెయ్యటం



Cycle సైకిలు द्विचक्रिका Sanskrit ద్విచక్రికా

లేదు. బ్రహ్మాండమైన యుద్ధం చేసి అలసిపోయి ఉన్నావు. గుర్రాలు కూడా డస్సి ఉన్నాయి. నీకూ, వాటికీ కాస్త విశ్రాంతి లభించగలందులకాపని చేశాను. రథం ఎప్పుడెలా నడపాలో తెలీకపోతే నేను సారథినే కాను. ఇప్పుడేం చెయ్యమంటావో చెప్పు, అలాగే చేస్తాను,'' అన్నాడు రావణుడి సారథి.

రావణుడు మెత్తబడి, తన సారథిని కాస్త పొగడి, ''రాముడికెదురుగా రథాన్ని తీసుకుపో!'' అని చెప్పాడు. రావణుడి రథం తిరిగి రాముడి ఎదుటికి వచ్చి నిలబడింది.

ఆ సమయంలో రాముడు కూడా అమితంగా అలిసిపోయి, రావణుడితో యుద్ధం చేసే శక్తి లేని స్థితిలో ఉన్నాడు. అది కనిపెట్టి, యుద్ధం చూడవచ్చిన అగస్త్యుడు రాముణ్ణి సమీపించి, ''రామా, నీకు ఆదిత్యహృదయం చెబుతాను. అది జపించి, శక్తివంతుడవై రావణుడితో యుద్ధం చెయ్యి,'' అని రాముడికి ఆదిత్యహృదయం చెప్పాడు. రాముడు దాన్ని మూడుసార్లు పఠించి, రెట్టింపైన బలం పొంది బాణం తీసుకుని రావణుడితో యుద్ధం సాగించటానికి ముందుకు వచ్చాడు. అతను మాతలితో, ''ఈసారి రావణుణ్ణి నిశ్చయంగా చంపబోతున్నాను. నువ్వు రథాన్ని చాకచక్యంగా నడుపు. దేవేంద్రుడి రథ సారథివైన నీకు విశేషం చెప్పనవసరం లేదు. ఏమాత్రం కూడా ఏమరుపాటు చెందవద్దని జ్ఞాపకం చేస్తున్నానంతే!'' అన్నాడు.

తన రథం మూలాన రేగిన దుమ్ము రావణుణ్ణి చుట్టుముట్టే లాగా మాతలి రథాన్ని రావణుడికేసి తోలాడు. రావణుడు మండిపడి రాముడిపైన బాణాలు వేశాడు. రాముడు ఇంద్రుడు పంపిన విల్లూ, బాణాలూ తీసుకుని రావణుడితో యుద్ధం ఆరంభించాడు.





Sun సూర్యుడు সূরজ Hindi సూరజ్



తన వద్ద ఉన్న అమోఘమైన బాణాలన్నీ రావణుడిపై ఎందుకు వ్యర్థమయ్యాయో రాముడికి అర్థంకాలేదు.

ఆ రామరావణులు ఆ విధంగా, క్షణం విశ్రాంతి లేకుండా, ఏడు రాత్రులూ, ఏడు పగళ్ళూ పోరాటం సాగించారు. చూసి చూసి మాతలి రాముడితో, ''వీణ్ణి చంపెయ్యక ఎందుకిలా తాత్సారం చేస్తున్నావు? వీడి మీద బ్రహ్మాస్త్రం ప్రయోగించు,'' అన్నాడు.

మాతలి ఆ మాట అనగానే రాముడొక మహాసర్పం లాంటి బాణాన్ని పైకి తీశాడు. దేదీప్యమానంగా వెలిగే ఆ బాణాన్ని బ్రహ్మ ఒకప్పుడు ఇంద్రుడి కోసం తయారు చేశాడు. అది చాలా బరువైనది, ఈకలు గలది, వజ్రం లాగా అతి కఠినమై ఇతర ఆయుధాలను ఛేదించగలది. రాముడా బాణాన్ని ఎక్కు పెట్టి మంత్రించి రావణుడి పైన వేశాడు. అది రావణుడి రొమ్మును ఛేదించి, అతని వీపులో నుంచి దూసుకుని బయటికి వచ్చేసింది. రావణుడు తన చేతిలో ఉండే ధనుర్బాణాలను వదిలేసి, ప్రాణాలుపోయి, రథంపై నుంచి నేలపైకి పడిపోయాడు.

అది చూసి హతశేషులైన రాక్షసులు పారిపోసాగారు. వానరులు చేతుల్లో చెట్లు పట్టుకుని, సింహనాదాలు చేస్తూ ఆ రాక్షసులను తరిమారు. రావణుడు చావగానే దేవదుందుభులు మోగాయి, పుష్పవర్షం కురిసింది. రాముణ్ణి భూమిపైన వానరులతో బాటు, ఆకాశంలోని దేవతలు కూడా పొగిడారు. రాముడూ, సుగ్రీవుడూ, అంగదుడూ

రామరావణ యుద్ధం ఎంత తీవ్రంగా సాగిందంటే ఉభయ పక్షాల వీరులూ యుద్ధం మానేసి ఆ ద్వంద్వ యుద్ధాన్ని చూడసాగారు. ఇద్దరూ తమ పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ, అదే తమ తుది పోరాటమన్నట్టుగా యుద్ధం చేశారు.

ఇలా రామ రావణులు మహా భయంకరమైన యుద్ధం చేస్తుండగా, రాముడు ప్రయోగించిన అతి తీక్షణమైన బాణానికి రావణుడి శిరస్సు తెగి నేలపైన పడిపోయింది. కాని, ఆ క్షణంలోనే రావణుడికి మరొక శిరస్సు పుట్టుకొచ్చింది. రాముడు దాన్ని కూడా ఖండించాడు. అది కిందపడే లోపుగా రావణుడికి మరొక శిరస్సు కనబడింది. ఈ విధంగా రాముడు రావణుడి తలను నూటఒక్కసారి ఖండించి కూడా ఏమీ చెయ్యలేకపోయాడు.



Sun సూర్యుడు சூரியன் Tamil సూరియన్

కృతకృత్యులై చాలా సంతృప్తి చెందారు. వానర ప్రముఖులూ, విభీషణుడూ రామలక్ష్మణుల చుట్టూ మూగి వారిని ప్రశంసించారు.

తన అన్న పోయినందుకు విభీషణుడు బాధపడ్డాడు. ఒక్క సీతాపహరణ కారణంగా రావణుడు నాశనమయ్యాడే గాని, అతను అనేక విధాల మహాపురుషుడనదగినవాడు; గొప్ప పండితుడు: నిష్కాపరుడు; అసమాన శౌర్య పరాక్రమాలు గలవాడు.

అన్న పోయాడని బాధపడుతున్న విభీషణుణ్ణి ఓదార్చుతూ రాముడు, ''రావణుడు పిరికిచావు చావలేదు, వీరుడి లాగా పోరాడుతూ పోయాడు. యుద్ధంలో జయాపజయాలు దైవాధీనాలు. ఎంతటి మహావీరుడైనప్పటికీ శత్రువు చేతిలో మరణం పొందవచ్చు. వీరమరణం పొంది వీరస్వర్గం అందుకున్న వాడి కోసం శోకించరాదు,'' అన్నాడు.

రాముడి అనుమతిపై విభీషణుడు తన అన్నకు శాస్త్రోక్తంగా దహనక్రియలు చేయబూనుకున్నాడు.

రావణుడు చచ్చాడని తెలియగానే అతడి భార్యలు పెద్దపెట్టున ఏడుస్తూ, ఉత్తర ద్వారంగుండా వెలువడి, రావణుడి శవాన్ని వెతుక్కుంటూ వచ్చారు. చివరకు వారతని శవాన్ని చూసి, దానిపైనపడి, గుండెలు అవిసేలాగా ఏడ్చారు; విభీషణుడు చెప్పినట్టు సీతను రాముడి కిచ్చినట్టయితే ఇంత దురన్యాయం జరిగేది కాదని ఆక్రోశించారు. ''త్రిలోకాలనూ జయించి, దేవతలందరినీ హడలగొట్టి, చివరికొక మానవమాత్రుడి చేతిలో



ప్రాణాలు వదిలావా?'' అని మందోదరి విలపించింది.

''ఈ ఆడవాళ్ళనందరినీ ఇళ్ళకు పంపి నీ అన్నకు ఉత్తరక్రియలు చెయ్యి,'' అని రాముడు విభీషణుడితో అన్నాడు. దుర్మార్గుడూ, అవినీతిపరుడూ అయిన తన అన్నకు తాను సంస్కారం చెయ్యటం యుక్తంగా ఉంటుందో ఉండదోనని విభీషణుడు ధర్మ సందేహం లేవదీశాడు. యుక్తంగానే ఉంటుందని రాముడు చెప్పిన మీదట అతను అందుకు పూనుకున్నాడు.

బ్రాహ్మణులు చందనపు చెక్కలతో చితి పేర్చి, దానిపైన ఒక గొంగళి పరిచారు. రావణుడి శవాన్ని అలంకరించి చితిపైన పడుకోబెట్టారు. విభీషణుడు చితికి చిచ్చుపెట్టాడు.



Sun సూర్యుడు সূর্য Bengali సూర్య

రామాయణం క్విజ్ అక్టోబర్ 2009
సరైన సమాధానం: C
విజేతకు అభినందనలు: పి.శ్రీనివాసు, కతేరు, రాజమండ్రి-533105

## చందమామ రామాయణం క్విజ్

రామరావణయుద్ధంలో రాముడి దివ్యరథాన్ని నడిపిన ఇంద్రుడి సారథి పేరేమిటి?
a. సుషేణుడు b. అగస్త్యుడు c. మాతలి
మీ సమాధానాన్ని CRQ <a/b/c> <space> <Name, Lang, Place> ఫార్మెట్‌లో 54646కు SMS చెయ్యండి. ఎంపిక చేయబడ్డ ఒక అదృష్ట విజేతకు కామిక్ కాంబో ప్యాక్ అందజేస్తాం.




తరవాత అతను తడిబట్టలతో నీళ్ళువదిలి, స్త్రీ జనాన్ని లంకకు పంపించి, రాముడి వద్దకు వచ్చాడు.

యుద్ధం చూడవచ్చిన దేవదానవ గంధర్వాదులు రామ పరాక్రమం గురించీ, వానరులు చేసిన యుద్ధం గురించీ మాట్లాడుకుంటూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. రాముడు మాతలిని గౌరవించి, అతణ్ణి రథంతో సహా స్వర్గానికి పంపేశాడు. తరవాత రాముడు కృతజ్ఞతతో సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో సహా శిబిరానికి వెళ్ళాడు.

అతను లక్ష్మణుడితో, ''ఇప్పుడు వెంటనే జరగవలిసిన ముఖ్యమైన పని విభీషణుణ్ణి లంకారాజ్యాభిషిక్తుణ్ణి చెయ్యటం. ఆ పని వెంటనే జరిపించు,'' అని చెప్పాడు.

లక్ష్మణుడు వానరులకు సువర్ణకలశాలిచ్చి సముద్ర జలం తెప్పించాడు. అతడు విభీషణుణ్ణి సింహాసనం పైన కూర్చోబెట్టి ఆ జలంతో అభిషేకించాడు. విభీషణుడి మంత్రులూ, అతడిపట్ల భక్తిగల రాక్షసులూ సంతోషించారు. విభీషణుడు తన ప్రజలకు నచ్చే మాటలు చెప్పాడు. రాక్షస పౌరులు అతనికి రకరకాల వస్తువులు కానుకలుగా అర్పించారు. విభీషణుడు కూడా రామలక్ష్మణులకు దివ్యమైన వస్తువులను కానుకలుగా ఇచ్చాడు.





Sun సూర్యుడు सूर्य Marathi సూర్య



# పంచతంత్ర కథలు

## మిత్రభేదం

దక్షిణ భారతదేశంలో మహిళారూప్యమనే నగరాన్ని అమరశక్తి అనే రాజు పాలించేవాడు. ఆయన గొప్ప శక్తివంతుడు, ధీమంతుడు, దయావంతుడు; లలిత కళాకౌశలమూ, రాజకీయ చతురతా కలవాడు. ఆయనకు వసుశక్తీ, ఉగ్రశక్తీ, అనేకశక్తీ అని ముగ్గురు కుమారులు. వారికి చదువు అబ్బలేదు, లోక జ్ఞానం లేదు. వారికి రాజనీతీ, రాజతంత్రమూ, సాధారణ జ్ఞానమూ సైతం లేకపోవటం చూసి రాజుకు ఎంతో విచారం కలిగింది.

ఆయన ఒకనాడు తన మంత్రులను పిలిచి, ''నా కొడుకులు మూఢులన్న సంగతి మీరెరుగుదురు. జ్ఞానమూ, సద్బుద్ధీ లేని కొడుకు గొడ్డుమోతు ఆవులాగా నిరర్థకం. అలాంటి కొడుకులను కనేకన్నా సంతానం లేకుండా ఉండడమే మేలు; సన్యసించటం మేలు. అందుచేత నా కొడుకులలో జ్ఞానాన్ని వికసింపచేసి, వారిలో రాజనీతీ, పరిపాలనా దక్షతా కలిగించేమార్గం ఏదో చెప్పండి,'' అన్నాడు.

''ఈ నగరంలోనే విష్ణుశర్మ అనే గురువు ఉన్నాడు. ఆయన సమస్త కళలను కాచి వడబోసినవాడు. అంతే కాదు; ఆయన చాలా సులువుగా విద్యాబోధ చెయ్యగలడు. ఆయనకు మహారాజుగారు తమ కుమారులను అప్పగించినట్టయితే అతి శీఘ్రకాలంలో ఆయన వారిని రాజనీతిలోనూ, ప్రపంచ జ్ఞానంలోనూ ఆరితేరేటట్టు చేయగలడు,'' అని ఒక మంత్రి చెప్పాడు.

రాజు విష్ణుశర్మను పిలిపించి, తన కొడుకులకు రాజనీతీ, వివేకమూ నేర్పినట్టయితే నూరుగ్రామాలు ఇస్తానన్నాడు.

''మహారాజా, నేను విద్యను విక్రయించను. ఎనభైఏళ్ళవాణ్ణి, నాకు ధనం ఎందుకు? అడిగిన వారికి విద్యాదానం చెయ్యటం నా విధి. ఆరుమాసాలలో నేను మీ పిల్లలకు





Sun సూర్యుడు ಸೂರ್ಯ Kannada సూర్య



రాజనీతీ, వివేకమూ కలిగిస్తాను,'' అన్నాడు విష్ణుశర్మ.

రాజు సంతోషించి, తనపిల్లలను ఆయనకు అప్పగించాడు. ఆయన వారికి పంచతంత్రం అనేది అయిదు భాగాలుగా చెప్పాడు. ఆ భాగాలేవంటే-మిత్రభేదం, మిత్రసంప్రాప్తి, కాకోలూకీయం, లబ్ధప్రణాశం, అపరీక్షిత కారకం. విష్ణుశర్మ చెప్పిన ఈ పంచతంత్రం ద్వారా రాజకుమారులు అయిదు మాసాలలో రాజనీతిలోనూ, లోకజ్ఞానంలోనూ ఆరితేరిన వారైనారు.

### 1. సింహము-ఎద్దు

దక్షిణదేశంలో మహిళారూప్యమనే నగరంలో వర్ధమానుడనే వర్తకుడు ఉండేవాడు. ఆయన గొప్ప ధనికుడూ, నీతిపరుడూ, దాతకూడానూ. ఆయన ధనాన్ని ధర్మబద్ధమైన వ్యాపారం ద్వారా తేలికగా సంపాదించి, వివేకంతో ఖర్చు చేసేవాడు.

ఒకనాడు ఆయన రెండెడ్లబళ్ళ మీద ఖరీదైన వర్తకపు సరుకులు వేసుకుని, యమునా తీరానగల మధురానగరానికి బయలుదేరాడు. ఒక బండికి కట్టిన నందికం, సంజీవకం అనేవి మేలైన ఎద్దులు.

కొన్నాళ్ళకు బిడారు యమునా తీరానగల అడవిని చేరుకున్నది. ఆ అడవిలో అనేక రకాల చెట్లూ, అడవి జంతువులూ ఉండేవి. ఇక్కడ సంజీవకం అనే ఎద్దు బురదనేల మీద కాలుజారి, మడమ విరిగి, పడిపోయి కదల లేకపోయింది. బండివాడు వర్ధమానుడికి ఈ సంగతి చెప్పాడు.

వర్ధమానుడు ఎంతో చింతించి, అయిదు రోజులపాటు ప్రయాణం నిలిపి, సంజీవకానికి చికిత్సలు చేయించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. ఆయన శీఘ్రంగా మధుర చేరుకుని, పని చూసుకోవలసి ఉండటం చేత, సంజీవకానికి బండివాణ్ణీ, మరొక సేవకుణ్ణీ తోడు ఉంచి, తగినంత మేతా, డబ్బూ వారికి ఇచ్చి, ''ఎద్దును శ్రద్ధగా సంరక్షించి, బాగుకాగానే నా వద్దకు తీసుకురండి. ఒకవేళ అది చావటం జరిగితే, దానికి శ్రద్ధగా దహన సంస్కారాలు జరిపి మీరు వచ్చెయ్యండి,'' అన్నాడు.

ఇలా చెప్పి ఆయన తన బళ్ళనూ, సరుకునూ మధురకు తరలించుకుని వెళ్ళిపోయాడు. ఆ ఇద్దరు మనుషులూ ఒంటరిగా



Sun సూర్యుడు ସୂର୍ଯ୍ୟ Oriya సూర్య

అడవిలో ఉండటానికి భయపడి, ఎద్దును దాని మానాన అక్కడే వదిలేసి, మర్నాడే తమ యజమానిని చేరుకుని, ఎద్దు చచ్చిపోయిందని చెప్పారు.

అయితే, అదృష్టవశాన సంజీవకం కోలుకున్నది. అది క్రమంగా లేచి, కుంటుతూ తిరగసాగింది. అది నింపాదిగా నడుచుకుంటూ, అరణ్యంగుండా యమునానది ప్రవహించే చోటుకు చేరుకున్నది. అది నది ఒడ్డున గల పుష్టికరమైన గడ్డిమేసి, స్వచ్ఛమైన నదీ జలం తాగి త్వరలోనే బలాన్నీ, ఆరోగ్యాన్నీ పొంది, శివుడి వాహనమైన నందికి సమానంగా తయారైంది.

ఆ అరణ్యంలోనే పింగళకం అనే సింహం, నక్కలనూ, ఇతర జంతువులనూ పరివారంగా పెట్టుకుని నివసిస్తున్నది. ఆ సింహం ఒకనాడు యమునలో నీరు తాగబోయి, సంజీవకం పెట్టిన పెద్ద రంకె విని, అలాంటి భయంకర ధ్వనిచేసే ప్రాణి ఏమై ఉంటుందో తెలియక బెదిరిపోయింది. అది తన భయాన్ని పైకి తెలియనివ్వక, నీరు తాగే ప్రయత్నం మాని, మర్రిచెట్టు కింద తన నివాసానికి తిరిగి వచ్చి, జరిగిన దాన్ని గురించి ఆలోచించసాగింది. ఇతర మృగాలు దాన్ని పరివేష్టించి ఉన్నాయి. భయపడి నప్పటికీ దాని గాంభీర్యం తగ్గలేదు. మృగరాజుకు మనిషి రాజులలాగా అభిషేకమూ, దుస్తులూ, చదువులూ, అవసరం లేదు. ప్రకృతే దానిని రాజుగా సృష్టించింది.

సింహం వెంట ఉన్న జంతువులలో కరటకమూ, దమనకమూ అనే రెండు నక్కలున్నాయి. అవి పూర్వం సింహం కింద కొలువు





Sun సూర్యుడు સૂર્ય Gujarati సూర్య

చేసిన జంతువు బిడ్డలు. ప్రస్తుతం వాటికి పదవి లేదు. సింహం నది దాకా వెళ్ళికూడా నీరు తాగకుండా తిరిగి రావటం దమనకం గమనించింది. అది తన తోబుట్టువైన కరటకాన్ని ఎడంగా తీసుకుపోయి, ''మన ఏలిక అయిన పింగళకాన్ని చూశావా? నీరు తాగటానికి యమున వద్దకు వెళ్ళింది. నీరు తాగకుండా ఆకస్మికంగా ఎందుకు తిరిగి వచ్చిందీ? దాని ముఖం మరీ దీనంగానూ, విహ్వలంగానూ ఎందుకు ఉన్నదీ?'' అని అడిగింది.

దానికి కరటకం, ''తమ్ముడూ, ఎప్పుడు గాని రాజుకు సంబంధించిన విషయాలలో అనవసరంగా జోక్యం కలిగించుకోకు. అలా చపలచిత్తంతో లేనిపోని విషయాలలో జోక్యం కలిగించుకునే వాళ్ళు, సీల పెరికిన కోతిలాగా మెంటనే నశించిపోతారు,'' అన్నది. ''అదెలాగ?'' అని అడిగింది దమనకం ఆశ్చర్యంతో.

కరటకం చిలిపికోతి కథ ఇలా చెప్పింది: ఒక నగరం వెలుపల ఒక వర్తకుడు ఆలయం కట్టిస్తున్నాడు. ప్రతిరోజూ మధ్యాహ్నం వేళ పనివాళ్ళు తిండి తినటానికి నగరానికి వెళతారు. ఆ ప్రదేశమంతటా పెద్ద పెద్ద దుంగలను రంపాలతో కోస్తారు.

ఒకనాడు, కట్టుతూ ఉన్న దేవాలయం దగ్గిరికి కోతుల మంద వచ్చింది. ఒక బ్రహ్మాండమైన మాను సగం కోసి ఉన్నది. పనివాళ్ళు కోత ఆగిన చోట దుంగలో బిగువుగా ఒక సీల గుచ్చారు.

కోతులన్నీ గెంతుతూ ఆడుతూ ఉంటే ఒక చిలిపి కోతి ఆ సీలను చూసి, ''ఇది ఇక్కడ ఎందుకున్నదీ?'' అనుకుని, సీలను రెండు చేతులా పట్టి బలం కొద్దీ పెరికింది. సీల లాగగానే, ఎడంగా ఉన్న దుంగ భాగాలు కలుసుకున్నాయి. కోతి వాటి సందున నలిగి చచ్చిపోయింది.

కరటకం ఈ కథ చెప్పి, ''అందుకే నువ్వు లేనిపోని విషయాల జోలికి పోవద్దన్నాను. పిచ్చివాడా, మనకు కొలువు లేక పోయినా, ప్రభువు వదిలిన ఆహారం తిని బాగానే బతుకుతున్నాం. ఈ కాస్తా పోగొట్టుకోవటందేనికి?'' అన్నది. – *(ఇంకావుంది)*





Sun సూర్యుడు সূৰ্য Assamese హూర్జ్య

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.


NARAYANAMURTHY TATA


NARAYANAMURTHY TATA



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు ఫిబ్రవరి 2010 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.
**ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,**
**2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600 041**

## అభినందనలు

సి. నాగ ప్రణీత,
C/o సి. శ్రీనివాస్(ఎఈఈ),
3వ క్రాస్‌రోడ్, రాంజి నగర్,
నెల్లూరు-524002
ఆంధ్రప్రదేశ్.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





ఇదిగో నా నేస్తం!
ఇవే నాకు సమస్తం!!

## చందమామ లోకజ్ఞానం క్విజ్-9 అక్టోబర్ 2009 సమాధానాలు

1. ఈద్-ఉల్-ఫితర్ 2. నౌరోజ్ 3. ఓణం 4. పాంగ్ త హబాల్
5. పుష్కర్ మేళా 6. కర్వా చౌత్

*విజేతలకు అభినందనలు: 1. ఆర్. మనోజ్ కుమార్ రెడ్డి, రిజర్వాయర్ కాలనీ, తిరుపతి-517507.*
*2. కె.కె. చేతన్ కుమార్, సైనిక్ స్కూల్, కోరుకొండ, విజయనగరం జిల్లా-535214.*



Sun సూర్యుడు സൂര്യൻ Malayalam సూర్యన్

# వేగ సూత్రం

**ఈ నెల సమస్య:**

నేలమీదా, గాలిలో నడిచే వాహనాన్ని రూపొందించాడు ఒక శాస్త్రవేత్త. భూమిమీద ఆ వాహనం 7 గంటల 47 నిమిషాలలో 842 కి.మీ. ప్రయాణం చేస్తుంది. గాలిలో 6 గంటల 34 నిమిషాలలో 2000 కి.మీ. దూరం వెళుతుంది. మొత్తం మీద ఆ వాహనం వేగం ఎంత? ఈ సమస్య పరిష్కారానికి దగ్గరి వేగ సూత్రం ఏది?

మీ వేగసూత్రాన్ని డిసెంబర్ 30వ తేదీ లోగా మాకు రాసి పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ.500. విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ. 100/- ఇవ్వబడుతుంది.

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:
ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్,
సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600041.
లేదా contests@chandamama.com కు ఇ-మెయిల్ చేయండి.

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం జనవరి '10 సంచికలో ప్రచురించబడుతుంది.*

---

**అక్టోబర్ నెల సమస్యకు సరైన సమాధానం:**

**స్టెప్ *1:*** మొత్తం ఐస్‌క్రీములు లెక్కగట్టండి:

25+45+30+53+28+32=213

**స్టెప్ *2:*** ఐస్‌క్రీములు ఇవ్వడానికి వ్యాపారి వెళ్ళవలసిన చోట్లను లెక్కగట్టండి:

4+3+2=9

వ్యాపారి ఇంటికి తీసుకు వెళ్ళే ఐస్‌క్రీముల సంఖ్యను తెలుసుకోవాలంటే, మొత్తం ఐస్‌క్రీములను, సరఫరా చేయవలసిన చోట్ల సంఖ్యతో భాగహారం చేయాలి. అంటే 213/9

మూడంకెల సంఖ్యను 9తో భాగించవలసి వచ్చినప్పుడు కింది విధానాన్ని అనుసరించవచ్చు.

ఎ. భాగింపబడే సంఖ్యలో వందల స్థానంలో ఉన్న అంకెను విభాజ్యం ఎడమచేతివైపు వేసుకోవాలి.

అంటే 213 నుంచి 2ను రాసుకోవాలి.

బి. ఒకటి, పదవ స్థానాలలో ఉన్న అంకెలను కూడిక చేసి వచ్చేదాని భాగహార లబ్ధం కుడిచేతి వైపు వేసుకోవాలి. అంటే 1+3=4.

సి. ఇప్పుడు మీ భాగహార లబ్ధం 24 అవుతుంది. దీన్ని పక్కన పెట్టండి.

ఇప్పుడు భాగహార లబ్ధంలోని మూడు అంకెలను కూడిక చేయండి. ఇది శేషం.

2+1+3=6

నిడివి భాగహారం చేసి మీ సమాధానాన్ని సరిచూసుకోండి! భాగహార లబ్ధం 23.6 వస్తుంది (రౌండ్ చేసినట్టయితే 24). శేషం 6 వస్తుంది! అద్భుతం కదూ!

6 ఐస్‌క్రీములు మిగిలి ఉండడం వల్ల ఒక బిడ్డకు 6/2=3 ఐస్‌క్రీములు వస్తాయి.

విజేత: ఐ. అజీమ్ బాషా, గౌతమ్ హైస్కూల్, కె.వి.జగన్నాథ్ రోడ్, కొత్తపేట, కుప్పం-517425



Sun సూర్యుడు ᱥᱤᱧ ᱪᱟᱸᱫᱚ Santali శిఞ్ చాందో

# ప్లాస్టిక్ సంచీ లోపల చిన్న మొక్కలు

ఏమేం కావాలి?

- పారదర్శకమైన ప్లాస్టిక్ జార్లు
- జిప్‌లాక్ ప్లాస్టిక్ సంచీలు
- గులకరాళ్ళు, మన్ను
- ధాన్యాలు/మొలకెత్తే విత్తనాలు
- నీరు

తయారు చేయడం ఎలా?

- ప్లాస్టిక్ జార్‌ను తీసుకుని, అందులో అడుగున అర అంగుళం మందంలో గులకరాళ్ళను నింపండి.
- గులకరాళ్ళమీద మన్ను పోయండి. జార్‌లో దానికి రెండింతల ఖాళీ ఉండాలి.
- వేళ్ళతో మన్నుమీద గుంతలు గుచ్చి, విత్తనాలు చల్లండి. దానిమీద మరింత మన్నువేసి మూయండి.
- అడుగున ఉన్న గులకరాళ్ళు మునిగేంత వరకు నీటితో నింపండి.
- ఈ బయోమ్‌ను శుభ్రమైన ప్లాస్టిక్‌సంచీలో ఉంచి సీల్‌చేయండి. దాన్ని ఎండలో ఉంచండి.
- మొలకలొచ్చి వారంలో చెట్లు పెరుగుతాయి. వివిధ పరిస్థితులలో మీ బయోమ్‌ను పరిశీలించి చూడండి.
- నీరు దానంతట రీసైకిల్ కావడం వల్ల మీరు మళ్ళీ నీరు పోయవలసిన అవసరం లేదు.

కాన్సెప్ట్:

ఈ మినియేచర్ బయోమ్‌లో బాష్పీభవనం, ద్రవీభవనం, అవపాతనం అనే మూడు ముఖ్యమైన ప్రక్రియలు జరుగుతాయి. గింజలు మొలకెత్తుతున్నప్పుడు, వేళ్ళు నీరు పీల్చుకోవడంతో మొక్కలు పెరుగుతాయి. ఆకుల నుంచీ, మట్టి నుంచీ నీరు ఆవిరవుతుంది. ఇది బాష్పీభవనం. ఆ తరవాత సంచీలోపలి భాగంపై చిన్నచిన్న నీటి బిందువులు ఏర్పడతాయి. ఇది ద్రవీభవనం. నీటి బొట్లు మట్టిమీద వానలా పడతాయి. ఇది అవపాతనం. అందువల్ల సంచీలోని మొక్కలు వాటంతట అవే బతక గలుగుతాయి!



Sun సూర్యుడు सूर्यः Sanskrit సూర్యః

# చందమామ లోకజ్ఞానం క్విజ్-11

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. **250**లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50** రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే:

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్-**11** అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. డిసెంబర్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. ఫిబ్రవరి 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## క్రిస్మస్ సమయం!




1. ఎవరి జన్మదినాన్ని క్రిస్మస్‌గా జరుపుకుంటారు?
2. శాంతాక్లస్ చారియట్‌ను ఏ మృగాలు లాగుతాయి?
3. క్రైస్తవుల పవిత్ర గ్రంథం పేరేమిటి?
4. క్రిస్మస్ గీతం 'జింగిల్ బెల్స్'లో దేనిమీద స్వారీ చేయడం వినోదభరితం అని ప్రస్తావించబడింది?
5. 'క్రిస్మస్ కరోల్'ను ఎవరు రచించారు? మొట్టమొదట ఎప్పుడు ప్రచురించబడింది?
6. ముగ్గురు జ్ఞానులను ఏమని పిలుస్తారు?
7. డిసెంబర్ 25న క్రిస్మస్‌గా తొలి చర్చ్ ఎందుకు నిర్ణయించింది?
8. 'క్రిస్మస్ చెట్టు'ను కొవ్వొత్తులతో ప్రకాశింపజేసిన మొట్టమొదటి వ్యక్తి ఎవరు?





Teacher ఉపాధ్యాయుడు अध्यापक Hindi అధ్యాపక్



# నాగాల ఒప్పందం




కామేశం ఇంటికి ఒక్కుమ్మడిగా పదిమంది చుట్టాలొచ్చారు–అదీ ఆ ఊళ్ళో నెలకు పైగా ఉండే పనిమీద. అంతమందికీ అవసరాలు చూడాలంటే పనివాళ్ళు కావాలి. ఉన్న పాలేళ్ళకు పొలంపనులు ముమ్మరంగా ఉండడంతో ఇంటిపనులు చేసే తీరుబడి లేదు. ఆయన అదనపు పనివాడికోసం చూస్తున్నాడని తెలిసి ముకురయ్య ఆయనింటికి వెళ్ళాడు.

ముకురయ్య మంచి పనివాడే కానీ–ఓ ఇంట్లో పది రోజులకు ఒప్పుకుని, మధ్యలో వేరేచోట పనిచేస్తూ, మొదట ఒప్పుకున్న పనికి నాగా పెట్టడం వాడికి రివాజు. అందుకని వాణ్ణెవరూ శాశ్వతంగా పనికి పెట్టుకోరు. తన పద్ధతి మార్చుకోడు కానీ, ముకురయ్యకు ఎక్కడైనా శాశ్వతంగా పనికి కుదరాలని ఉంది. తగిన అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. ఇప్పుడు కామేశం దగ్గిర అలాంటి అవకాశం వచ్చిందని వాడి ఆశ.

మామూలుగా అయితే కామేశం ఎవరినైనా పనిలోకి తీసుకునేందుకు బోలెడు షరతులు పెడతాడు. ఇప్పుడు అవసరంలో ఉన్నాడు కాబట్టి, ముకురయ్య తత్వం తెలిసినా కాస్త దిగివచ్చి, ''మధ్యలో నాగా పెడితే–ఒక రోజుకు రెండు రోజుల జీతం తగ్గిస్తా,'' అని ఒకే ఒక్క షరతు పెట్టాడు.

ముకురయ్య ఒప్పుకుని, ''చుట్టాలు వెళ్ళిపోయినా నన్ను పనిలోంచి తీసేయకూడదు. లేదా వేరెక్కడైనా పని ఇప్పించాలి. అలా పత్రం రాసిస్తే పనిలో చేరతా,'' అంటూ తనూ ఒక షరతు పెట్టాడు.

పనివాడికిచ్చిన పత్రానికి విలువేమిటిలే అనుకున్న కామేశం, అప్పటికి పబ్బం గడుస్తుంది కదా అని అలాగే పత్రం రాసి, వాణ్ణి పనిలో పెట్టుకున్నాడు.

ముకురయ్య వారం రోజులపాటు ఒళ్ళొంచి పనిచేసి కామేశం చుట్టాల మెప్పు పొందాడు. ఆ తర్వాత ఒక రోజు నాగా. మళ్ళీ రెండ్రోజులు



Teacher ఉపాధ్యాయుడు ஆசிரியர் Tamil ఆసిరియర్



పనిచేసి, రెండ్రోజులు నాగా. అలా నెల్లాళ్ళలో పది రోజులు నాగా. అయితే నాగాలెన్ని పెట్టినా, పని బాగా చేశాడని మెచ్చుకున్న చుట్టాలు వెళ్ళేటప్పుడు వాడికి ఈనాం కూడా ఇచ్చారు.

చుట్టాలు వెళ్ళిపోయాక, ''నీ నాగాలు నాకు నచ్చలేదు. ఇక భరించలేను. నిన్ను ఈ రోజే పనిలోంచి తీసేస్తున్నాను. నాకే నచ్చని నిన్ను వేరొకరింట్లోనూ కుదర్చలేను,'' అన్నాడు కామేశం.

''పత్రం రాసిచ్చేక నువ్వలాగంటే నేనొప్పుకోను,'' అంటూ ముకురయ్య పని మాననన్నాడు.

''అయితే వెళ్ళి గ్రామాధికారికి చెప్పుకో. ఆయన నా స్నేహితుడే! నీ దగ్గిరున్న పత్రం వల్ల నాకే ఇబ్బందీ ఉండదు,'' అన్నాడు కామేశం మొండిగా.

ఈ గొడవ ఫిర్యాదుతో తేలేది కాదని ముకురయ్యకూ తెలుసు. అందుకని వాడు కూడా మొండికేసి, ''నేనిక్కణ్ణించి కదలను. గ్రామాధికారికి నువ్వే ఫిర్యాదు చేసుకో,'' అన్నాడు.

దాంతో ఇద్దరి మధ్యా పెద్ద గొడవయింది. అది విని చుట్టుపక్కలవాళ్ళు చాలా మంది అక్కడికి చేరారు. ముకురయ్యను తప్పు పట్ట లేకా, కామేశాన్ని సమర్థించలేకా వచ్చినవాళ్ళు తటపటాయిస్తుంటే–పొరుగింటి రామేశం మాత్రం, రాసిచ్చిన పత్రాన్ని కాదనడం సబబు కాదంటూ కామేశాన్ని మందలించాడు.

కామేశానికి ఉక్రోషం వచ్చింది. అయినా అణచుకుని, ''సరే! నా పొరుగువాడివి కాబట్టి సాయం అడుగుతున్నా. ముకురయ్యను నువ్వు పనిలో పెట్టుకో,'' అని సవాలు చేశాడు.

దాంతో రామేశం వెనక్కి తగ్గుతాడనుకున్నాడు కానీ, ఆయనేమాత్రం తడబడకుండా, ''సరే, దాందేముందీ–నాకూ పనివాడి అవసరముంది. ముకురయ్యనేపనికిపెట్టుకుంటాను. వాడెన్ని నాగాలు పెట్టినా ఏమీ అనను. పనిలోంచి తొలగించను. ఎటొచ్చీ తనకిష్టమైనప్పుడే కాక, నాకిష్టమైనప్పుడు కూడా వాడు నాగాలు పెట్టాలి. నాగాల రోజులకు జీతముండదు. ఆ ప్రకారం పత్రం రాస్తే–వాడీరోజే మా ఇంట్లో పనికి చేరవచ్చు,'' అన్నాడు.

గ్రామాధికారికి ఫిర్యాదు చేయడంకంటే ఈ ఏర్పాటు బాగుందనిపించింది ముకుర



Teacher ఉపాధ్యాయుడు শিক্ষক Bengali శిక్షక్

య్యకు. అదీకాక, కామేశంలా కాకుండా రామేశం మాటమీద నిలబడే మనిషని వాడికి తెలుసు. అందుకని వాడా విధంగా పత్రం రాసి, ఆయనింట్లో పనికి చేరాడు.

తనకు పీడ వదిలిందని కాక, అది రామేశానికి తగులుకుందని మనసులో మరింత సంతోషించాడు కామేశం. రామేశం మంచితనాన్నీ, పరోపకార గుణాన్నీ మెచ్చుకుంటున్న ఊరివారితో ఆయన, ''అది పరోపకారం కాదు. తను తెలివైనవాడినన్న అహంకారం. నేను వదుల్చుకోవాలనుకున్న ముకురయ్యో కొరివి. రామేశం కోరి ఆ కొరివితో తల గోక్కుంటున్నాడు. చూస్తూండండి. వాడితో ఎన్నో రోజులు పనిచేయించుకోలేడు. త్వరలోనే ఆయన తన పొరపాటు గ్రహించి-వాణ్ణి వదుల్చుకునే ఉపాయం చెప్పమంటూ మనందరి దగ్గరకీ వస్తాడు,'' అన్నాడు.

కామేశం చెప్పినట్లే ముకురయ్య రామేశానికి కొరివే అయ్యాడు. వారం రోజులు బాగానే పని చేశాక, వాడి నాగాల జోరు మొదలైంది. రామేశం వాణ్ణి పదేపదే హెచ్చరించినా ప్రయోజనం లేకపోయింది.

చివరికాయన ఒకరోజు వాడితో, ''గడచిన నెలలో నీ ఇష్ట ప్రకారం పదమూడు రోజులు నాగా పెట్టావు. ఇప్పుడు నా ఇష్టప్రకారం-ఈ నెలలో నాకు ఒక్కరోజే పనిచేసి మిగతా రోజులన్నీ నాగా పెట్టు,'' అన్నాడు.

ముకురయ్య పెద్దగా చలించలేదు. ఆయన కోపంకొద్దీ అలాగన్నాడనీ-అన్ని నాగాలు పెడితే ఇంట్లో గడవక ఏదో రోజున



Teacher ఉపాధ్యాయుడు शिक्षक Marathi శిక్షక్

తనే పిలుస్తాడనీ అనుకుని బింకంగా సరేనని వెళ్ళిపోయాడు.

అంతా తను చెప్పినట్టే జరిగిందని సంతోషించిన కామేశం, గ్రామస్థుల దగ్గిర బీరాలు పోయాడు.

అయితే, ఈలోగా రామేశం ఇంటి పనికి వేరే పనివాణ్ణి పెట్టుకున్నాడు. అది తెలిసిన ముకురయ్య కామేశంతో సహా కొంతమంది గ్రామస్థుల్ని వెంటబెట్టుకుని రామేశం ఇంటికి వెళ్ళి, ఒప్పందం తప్పినందుకు ఆయన్ను తప్పు పట్టాడు. కామేశం కూడా ముకురయ్యకు వత్తాసు పలుకుతూ, ''వేరే పనివాణ్ణి పెట్టుకుంటే ముకురయ్యను పనిలోంచి తీసేసినట్టే కదా! అప్పుడు నువ్వు నాకు చెప్పిందేమిటి? ఇప్పుడు చేస్తున్నదేమిటి? ఊరందరిలో మంచివాడివనీ, పెద్దమనిషివనీ పేరు పొందిన నువ్విలా ఒప్పందం మరిచి ప్రవర్తించడం న్యాయం కాదు,'' అని మందలించాడు.

అందుకు రామేశం నవ్వి, ''నేను ముకురయ్యను పనిలోంచి తీసేయలేదు. నా ఇష్ట ప్రకారం నాగాలు పెట్టమన్నానంతే! ఈ నెలకైతే ఒక్కరోజైనా పని చేయమన్నాను కానీ, వచ్చే నెల నుంచి అన్ని రోజులూ నాగాలు పెట్టించాలనుకుంటున్నాను. ఇదంతా ఒప్పందం ప్రకారమే జరుగుతోంది. తను పని చేయనప్పుడు నేను వేరే మనిషిని పెట్టుకోకూడదని మా మధ్య ఒప్పందమేం లేదు. కామేశం! ఇదంతా నేను నాకోసం చేశానా? నువ్వు ముకురయ్యను వదుల్చుకునేందుకు సాయపడమంటే చేశాను. నువ్వొకసారి నీ ఒప్పందమూ, నా ఒప్పందమూ చూస్తే-నేనప్పుడు నీకు చెప్పిందీ, ఇప్పుడు చేస్తున్నదీ కూడా-ఆ ఒప్పందాల ప్రకారమేనని తెలుస్తుంది. కాస్త శ్రద్ధగా చదువు,'' అని కామేశాన్ని తనూ మందలించాడు.

అక్కడున్నవారికీ ఆయన మాటలు సబబుగా తోచాయి. ''తెలివిగా ముకురయ్యకు బుద్ధి చెప్పిన రామేశాన్ని మెచ్చుకోవాలి కానీ-తప్పు పట్టకూడదు,'' అంటూ వాళ్ళు కామేశాన్ని మందలిస్తుంటే-ముకురయ్య అక్కణ్ణించి తలొంచుకుని వెళ్ళిపోయాడు.

కామేశం మరోసారి రామేశం చేతిలో భంగపడ్డాడు.

\- బాబి





Teacher ఉపాధ్యాయుడు ఉಪಾಧ್ಯಾಯ Kannada ఉపాధ్యాయ



# 25-ఏళ్ళనాటి చందమామ కథ

## కలుపుకూలి

సిరిపురంగ్రామంలో ధర్మయ్య అనేవాడు తనకున్న రెండెకరాల చెక్కను స్వయంగా దున్నుకుని, తన కుటుంబానికి కావలిసిన గింజలు పండించుకునేవాడు. ఉన్నంతలో అతను తృప్తిగా బతుకుతూ అడిగిన వారికి చేతనైన సహాయం చేసేవాడు గాని, ఎవరినీ చెయ్యిచాచి అడిగి ఎరగడు.

ధర్మయ్యపొరుగున ఉన్న భద్రయ్యకు బంగారం పండే మాగాణిపాతికఎకరాలున్నా, ఆ రాబడితో ఏమాత్రం తృప్తి పడక వడ్డీ వ్యాపారం చేస్తూండేవాడు. ఈ వ్యాపారంతో అతను పేదసాదలను చాలా మందిని పీల్చి పిప్పి చేసేవాడు. అవసరం కొద్దీ మరో మార్గం కనిపించక విధిలేక అతని వద్ద అప్పు చేసిన వాళ్ళు అతణ్ణిపులిని చూసినట్టు చూసేవారు.

గ్రామాధికారి భద్రయ్య మనిషి, అతడి చేతి కీలుబొమ్మ. అతణ్ణి అడ్డం పెట్టుకుని భద్రయ్య మకుటంలేని మహారాజుగా ఏలుతున్నాడు. సిరిపురంలో-బీద ప్రజలు, తమకు అన్యాయం జరిగినా, చేసేదిలేక మౌనంగా భరించేవాళ్ళు.

తనకన్న ధర్మయ్యకు ఊళ్ళో ఎక్కువ గౌరవమూ, మంచి పేరూ ఉండటం చూసి భద్రయ్యకు చెప్పలేనంత మంటగా ఉండేది.

ఇలా ఉండగా ఒక రోజు భద్రయ్య గొడ్లు ధర్మయ్య పొలంలో పడి, అతని పంటచేను నాశనం చేశాయి. చేతికి అందనున్న పంట నాశనం అయ్యేసరికి ధర్మయ్య కంట నీరు పెట్టుకున్నాడు. గ్రామాధికారికి చెప్పుకుని లాభం లేదని అతనికి తెలుసు. అందుచేత అతను కిమ్మనకుండా ఊరుకున్నాడు.

కాని భద్రయ్య అతణ్ణి అంతటితో వదిలిపెట్టక, ధర్మయ్య తన గొడ్లను చావబాదాడని గ్రామాధికారికిఫిర్యాదు చేశాడు. గ్రామాధికారి





Teacher ఉపాధ్యాయుడు ଶିକ୍ଷକ Oriya शिक्षक



భద్రయ్య దగ్గర లంచం మేసి, ధర్మయ్యను కచేరికి పిలిపించాడు. ధర్మయ్య వెళ్ళేసరికి గ్రామాధికారి దగ్గర అతని అనుయాయులతో బాటు భద్రయ్య కూడా ఉన్నాడు.

''ధర్మయ్యా, నువ్వు భద్రయ్య గొడ్లను చావగొట్టావట. దానికి నీ సంజాయిషీ ఏమిటి?'' అని గ్రామాధికారి అడిగాడు.

ధర్మయ్య నివ్వెరపోయాడు. పంట నష్ట పోయిన తాను ఫిర్యాదు చేయవలిసింది పోయి, తనమీదే ఫిర్యాదా?

''అసలు జరిగిన విషయం ఇది. భద్రయ్యగారి గొడ్లు నా పంట పొలం మీద పడి నాశనం చేశాయి. గొడ్లను బయటికి తరిమానే తప్ప, వాటి ఒంటిమీద చిన్న దెబ్బ కూడా వెయ్యలేదు. నష్టపడిన నా మీద ఇలా ఆరోపణ చెయ్యటం ధర్మం కాదు, బాబూ,'' అన్నాడు ధర్మయ్య.

''నాకే ధర్మపన్నాలు చెబుతున్నావా? మేం తలుచుకుంటే ఈ సిరిపురంలో నీకు పిడికెడు బియ్యం పుట్టవు! నిన్నడిగి నేను న్యాయ విచారణ చేస్తాననుకున్నావా? నా తీర్పు విను. భద్రయ్య గొడ్లను చావగొట్టినందుకు వంద రూపాయలు అతనికి నష్టపరిహారంగా ఇచ్చుకో. అతని గొడ్లు నీ పొలంలో కలుపు తీసినందుకు వాటి కూలి మరో యాభైరూపాయలు! మొత్తం నూటయాభై ఇచ్చుకో,'' అన్నాడు గ్రామాధికారి.

ఆ మాటలకు ధర్మయ్యకు మతి పోయినట్టయింది. ''గొడ్లు కలుపు తీయటమేమిటి, బాబూ?'' అని అతను అడిగాడు.

''ఏమిటా మతిలేని ప్రశ్న? భద్రయ్య గొడ్లు నీ పొలంలో కలుపు మొక్కలు మాత్రమే మేశాయి. నువ్వు వేరే మనుషులను పెట్టి కలుపు తీయించనవసరంలేదు. వాళ్ళకిచ్చేది భద్రయ్య గొడ్లకే రావాలి,'' అన్నాడు గ్రామాధికారి.

''గొడ్డుకు పంటమొక్క ఏదో, కలుపు మొక్క ఏదో, తెలుస్తుందా? ఇదెక్కడి న్యాయం, బాబూ?'' అన్నాడు ధర్మయ్య.

గ్రామాధికారి కోపంతో, ''నా తీర్పుకు ఎదురు చెప్పావు గనక, న్యాయస్థానానికి యాభై రూపాయలు జరిమానా కట్టు. రేపు సాయంత్రంలోగా రెండువందల రూపాయలు కట్టక పోతే నీకు దండన విధించవలిసి ఉంటుంది,'' అన్నాడు.

ధర్మయ్య గుడ్లనీరు కుక్కుకుంటూ అక్కడి నుంచి బయలుదేరాడు. తన ఇంటికి నాలు



గిళ్ళు అవతల ఉన్న రామయ్య వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పుకుని దీనంగా మొరపెట్టు కున్నాడు.

రామయ్య కూడా ధర్మయ్యలాగే సజ్జనుడు. ఇద్దరూ మంచి స్నేహితులు. ధర్మయ్య చెప్పి నదంతా విని రామయ్య చాలా బాధపడి, ''నీకు చాలా అన్యాయం జరిగింది ధర్మయ్యా. సరే, వీళ్ళకు తగిన బుద్ధి చెబుదాం. ముందు ఈ రెండు వందలు పట్టుకెళ్ళి, వాళ్ళ మొహాన కొట్టిరా. ఇంత కింత వాళ్ళ నుంచి ఎలా రాబ ట్టాలో నేను చూసుకుంటాను,'' అని డబ్బిచ్చి ధర్మయ్యను పంపేశాడు.

ఆ మర్నాడు రామయ్య తన గొడ్లను తీసు కెళ్ళి, గ్రామాధికారి పంటపొలంలో శుభ్రంగా మేపాడు. గ్రామాధికారి కమతగాళ్ళు ఇది చూసి, పరుగునవెళ్ళి గ్రామాధికారికి చెప్పారు. అతను హుటాహుటి వచ్చి చూసేసరికి, రామయ్య తన గొడ్లకు తాపీగా నీరు పట్టిస్తూ కనిపించాడు.

''రామయ్యా, నువ్వు నా పొలంలో నీ గొడ్లను మేపావని తెలిసింది. ఏమిటి నీ సంజాయిషీ!'' అని గ్రామాధికారి అడిగాడు.

''మీ పొలంలో గొడ్లను మేపానా? ఎవరో కిట్టనివాళ్ళు చెప్పి ఉంటారు,'' అన్నాడు రామయ్య.

''నా మనుషులు చూసి చెప్పారు. నువ్వు చేసిన పనికి నష్టపరిహారం ఇచ్చుకోవలసి ఉంటుంది,'' అన్నాడు గ్రామాధికారి.

''మీకు చేతనైంది చేసుకోండి,'' అన్నాడు రామయ్య.





Teacher ఉపాధ్యాయుడు শিক্ষক Assamese హిక్షక్

''సరే, నీ విషయం న్యాయస్థానంలో తేలుస్తాను,'' అంటూ గ్రామాధికారి బస్తీకి పోయి, రామయ్య తన పది ఎకరాల పంట పొలం నాశనం చేశాడనీ, తనకు నష్టపరిహారం ఇప్పించాలనీ న్యాయాధికారిని కోరాడు.

మర్నాడు న్యాయస్థానానికి హాజరుకావలసిందని రామయ్యకు కబురు వెళ్ళింది. రామయ్య, ధర్మయ్యను వెంటబెట్టుకుని న్యాయస్థానానికి వెళ్ళాడు.

న్యాయాధికారి రామయ్యను, ''నువ్వు గ్రామాధికారి పొలంలో గొడ్లను మేపి నష్టం కలిగించావట, నిజమేనా?'' అని అడిగాడు.

''తమరు న్యాయమూర్తులు. తమతో ఉన్న మాట చెబుతాను. నేను గ్రామాధికారి పొలంలో గొడ్లను మేపిన మాట నిజమేగాని, నా గొడ్లు కలుపు మొక్కలు మాత్రమే మేశాయి. మిగతా పంటకు ఏమీ నష్టం కలిగించలేదు. తమరు నాకు కలుపు కూలి ఇప్పించాలి,'' అన్నాడు రామయ్య.

సభలోని వారంతా గొల్లున నవ్వారు. రామయ్య చెప్పిన మాటలో ఏదో గూఢార్థం ఉన్నదని తోచి న్యాయాధికారి, ''కలుపుకూలి ఏమిటి, రామయ్యా?'' అని అడిగాడు.

''ప్రభువులు న్యాయం చిత్తగించాలి. లోగడ భద్రయ్యగారి గొడ్లు ధర్మయ్యగారి రెండెకరాల పొలంలో కలుపు తీసినందుకు గ్రామాధికారిగారు యాభైరూపాయలు ఇప్పించారు. రెండెకరాలకే యాభై వస్తే గ్రామాధికారిగారి పదెకరాలకు ఇంకా ఎక్కువ వస్తుంది గదా అని వారి పొలంలో నా గొడ్ల చేత పని చేయించాను, బాబూ. న్యాయంగా నా గొడ్లకు కలుపు కూలి దక్కాలి గదా! వాటి యజమానిని గనక, ఆ డబ్బు నాకు ఇప్పించమని తమర్ని ప్రార్థిస్తున్నాను,'' అన్నాడు రామయ్య చేతులు కట్టుకుని.

న్యాయాధికారి జరిగిన మోసం గ్రహించాడు. ఆయన ధర్మయ్య నుంచి జరిగిన సంగతి తెలుసుకుని, ధర్మయ్యకు రెండు వందలతో బాటు కొంత పరిహారం కూడా భద్రయ్యచేత ఇప్పించి, గ్రామాధికారిని పదవి నుంచి తొలగించి, ఆ స్థానంలో రామయ్యను నియమించాడు.





Teacher ఉపాధ్యాయుడు അധ്യാപകൻ Malayalam అధ్యాపకన్



# తగిన వారసుడు!



ధర్మపురి రాజు విజయేంద్రుడు ప్రజాక్షేమమే ధ్యేయంగా పాలనసాగించే ధర్మప్రభువుగా ప్రజల మన్ననలందుకున్నాడు. తనకు సంతానం లేకపోవడంతో, తన తదనంతరం ప్రజల జీవితం ఎలా ఉంటుందో కదా అని తీవ్రంగా ఆలోచించి, రాజు ఒక నిర్ణయానికి వచ్చాడు. రాజోచిత విద్యలలో ఆరితేరిన సూర్యసేనుడు, చంద్రసేనుడు, వీరసేనుడు అనే ముగ్గురు క్షత్రియ యువకులను చేర దీసి పాలనా వ్యవహారాలలో శిక్షణివ్వసాగాడు.

ఆ ముగ్గురు యువకులూ సకల విద్యల లోనూ, ధైర్యసాహసాలలోనూ సమ ఉజ్జీలుగా ఉండడంతో, వారిలో ఎవరిని రాజు తన వారసుడిగా నియమిస్తాడోనని ప్రజలందరూ ఉత్సుకతతో ఎదురుచూడసాగారు.

రాజు కూడా ఈ విషయంగా వృద్ధమంత్రిని సంప్రదించి ఆయన సలహా తీసుకున్నాడు. మరునాడు ముగ్గురు యువకులనూ చేరబిలిచి, ఒక్కొక్కరికి ఇరవైవేల బంగారు వరహాలు అందజేసి, ''ఈ ధనంతో మీరు మన రాజ్యంలోని మూడు ప్రాంతాలకు వెళ్ళి నా ప్రతినిధులుగా ఐదేళ్ళపాటు పాలన సాగించండి,'' అని సూర్యసేనుణ్ణి చంద్రపురికీ, చంద్రసేనుణ్ణి రుద్రపురికీ, వీరసేనుణ్ణి కృష్ణగిరికీ పంపాడు.

సూర్యసేనుడికి కళలపట్ల ఆసక్తి ఎక్కువ. అందువల్ల అతడు అందమైన చంద్రపురిని చేరగానే అక్కడి ప్రకృతి శోభనుచూసి ముగ్ధుడయ్యాడు. ప్రశాంతంగా కనిపించిన చంద్రపురిని మరింత శోభాయమానంగా తీర్చిదిద్దాలనుకున్నాడు. నూతన రాజభవనంతో పాటు అక్కడక్కడ చక్కటి ఉద్యానవనాలు నిర్మించాడు. కవులు, కళాకారులను పోషించడానికి రాజు ఇచ్చిన ధనాన్ని వినియోగించసాగాడు.

ధర్మపురి దక్షిణ సరిహద్దులోని రుద్రపురిని చేరిన చంద్రసేనుడు అక్కడి పరిస్థితులను చూసి ఆలోచనలో పడ్డాడు. పొరుగురాజైన భూపతి ధర్మపురి మీద దాడి చేయడానికి సైన్యాన్ని రహస్యంగా సమాయత్తం చేస్తు





న్నట్టు తెలియవచ్చింది. దాంతో తనుకూడా ఆ ప్రాంతంలోని యువకులను చేర్చుకుని వారికి రహస్య యుద్ధశిక్షణ ఇవ్వడానికి రాజు ఇచ్చిన ధనాన్ని వినియోగించసాగాడు.

ఈ సంగతి తెలియక సరిహద్దులోకి హఠాత్తుగా దండెత్తి వచ్చిన పొరుగురాజు భూపతి సేనలను, చంద్రసేనుడి సేనలు దీటుగా ఎదుర్కొని తిప్పికొట్టాయి. అపార సైనిక నష్టంతో కోలుకోలేనంతగా దెబ్బతిన్న భూపతి చావు తప్పి కన్ను లొట్టపోయిన విధంగా అవమాన భారంతో వెనుదిరిగి పారిపోయాడు.

ఇక మూడవ యువకుడైన వీరసేనుడు రాజప్రతినిధిగా వెళ్ళిన కృష్ణగిరి ప్రాంత పరిస్థితులు చాలా భిన్నంగా కనిపించాయి. ఎటు చూసినా ఒక విధమైన స్తబ్ధత నెలకొని ఉన్నది.

అధికారులనూ, ప్రముఖులనూ పిలిపించి వీరసేనుడు పరిస్థితులను అడిగి తెలుసుకున్నాడు. ప్రత్యక్షంగా చూసి తెలుసుకున్నాడు.

పక్షం రోజుల తరవాత, రాజుగారు ఇచ్చిన ఇరవై వేల బంగారు వరహాలను నాలుగు భాగాలుగా విభజించాడు. మొదటి భాగాన్ని అంటే ఐదువేల వరహాలను అత్యవసర పరిస్థితుల్లో వాడుకోవడానికి అట్టి పెట్టాడు. రెండవ భాగాన్ని బాటలు వేయడం, నీటి వనరులు సమకూర్చడం, పాఠశాలలు, వైద్యశాలలు నిర్మించడం మొదలైన ప్రజోపయోగ కార్యక్రమాలకు వినియోగించాడు.

మూడవ భాగాన్ని రక్షణకు అంటే కాపలా భటులు, రక్షకభటుల నియామకానికీ, శిక్షణకూ వినియోగించాడు. నాలుగో భాగాన్ని బీడు భూములను సాగు భూములుగా మార్చడానికీ, చేతి వృత్తులను ప్రోత్సహించడానికీ వినియోగించాడు. దాంతో ప్రజలందరికీ చేతి నిండా పనులు కలగడంతో ఆ ప్రాంతంలోని స్తబ్దత తొలగిపోయింది. క్రమక్రమంగా ధాన్య సంపద, పశుసంపద పెరిగి చేతి వృత్తులు అభివృద్ధి చెందాయి.

ముగ్గురు యువకులూ తన ప్రతినిధులుగా తీసుకుంటూన్న చర్యలను గురించి రాజు విజయేంద్రుడు ఎప్పటికప్పుడు తెలుసుకుంటూనే ఉన్నాడు. ఐదేళ్ళు పూర్తి కాగానే మంత్రితో కలిసి తనే స్వయంగా వెళ్ళి మూడు ప్రాంతాలనూ పర్యటించి వచ్చాడు. వారం రోజుల్లో ముగ్గురు యువకులనూ రాజధానికి రమ్మని సందేశం పంపాడు.



Teacher ఉపాధ్యాయుడు शिक्षक: Sanskrit शिक्षकः

రాజగురువు సూచించిన శుభముహూర్తం రోజున ముగ్గురు యువకులతో సహా సభ ఏర్పాటయింది. రాజు తనవారసుడిగా ఎవరిని నిర్ణయిస్తాడా అని సభాసదులందరూ ఉత్కంఠతో ఎదురుచూడసాగారు.

సభను ఒకసారి కలయజూసిన రాజు, ''జీవిత లక్ష్యం ఆనందం. ఏ మనిషయినా ఆనందాన్నే కోరుకుంటాడు. ఆనందం లేకపోతే జీవితమే నిస్సారమవుతుంది. మనిషి ఆనందాన్ని పెంచేవి ఆటపాటలు, కళలు. నేనిచ్చిన ఇరవైవేల బంగారు నాణాలను కళల అభివృద్ధి కోసం వినియోగించిన సూర్యసేనుణ్ణి అభినందిస్తున్నాను,'' అన్నాడు.

ఆ తరవాత ఆయన చంద్రసేనుణ్ణి చూస్తూ, ''ఏ కళలైనా అభివృద్ధి చెందాలంటే ప్రశాంత వాతావరణం అవసరం. ప్రశాంత వాతావరణానికి రక్షణ ప్రధానం. రక్షణ కరువైతే ప్రజల జీవితం దినదినగండంగా పరిణమిస్తుంది. సరిహద్దు ప్రాంతంలో కొంతకాలంగా అశాంతి సృష్టిస్తూన్న పొరుగు రాజును సమర్థవంతంగా తిప్పికొట్టి, రాజ్యానికి వచ్చిన పెనుముప్పును తొలగించిన నిన్ను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను,'' అన్నాడు.

ఆ తరవాత కొంతసేపు మౌనం వహించిన రాజు, ''రాజ్యాధికారం అలంకారం కాదు; ప్రజలను కన్నబిడ్డల్లా కాపాడే గురుతర బాధ్యత. ప్రజలకు కావలసింది కూడు, గుడ్డ, గూడు, రక్షణ, విద్య. రాజన్నవాడు వీటన్నిటి మీదా దృష్టి సారించాలి. తను వెళ్ళిన కృష్ణగిరి ప్రాంత పరిస్థితులను పరిశీలించి, అక్కడి ప్రజలను కూడగట్టుకుని వారి జీవితాలకు సిరిసంపదలనూ, సుఖశాంతులనూ సమకూర్చడంతో పాటు ఇచ్చిన ఇరవైవేల బంగారు వరహాలను అరవైవేల వరహాలుగా అభివృద్ధి చేసిన వీరసేనుడే ధర్మపురికి కాబోయే రాజు. అతడే తగిన వారసుడు. చంద్రసేనుణ్ణి సేనాధిపతిగానూ, సూర్యసేనుణ్ణి కళల అభివృద్ధి అమాత్యుడిగానూ నియమిస్తున్నాను. వీరసేనుడి పాలనలో ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లగలరని దృఢంగా విశ్వసిస్తున్నాను,'' అన్నాడు. ప్రజల హర్షధ్వానాలతో సభ మారుమోగింది.





# బాధ్యత!

రంగవరం జమీందారు భుజంగరాయుడు, హఠాత్తుగా మరణించిన తన తల్లి నాగమాంబ జ్ఞాపకార్థం, ఆమె జన్మస్థలం ధర్మవరంలో ఒక వైద్యశాలను నిర్మించాలనుకున్నాడు. దివానుకు తన కోరికను తెలియజేసి, ''మాతృమూర్తి తొలి వర్ధంతికే వైద్యశాలను ప్రారంభించాలనుకుంటున్నాను. కాబట్టి యేడాదిలోగా నిర్మాణం పూర్తికావాలి!'' అని ఆజ్ఞాపించాడు.

జమీందారు చెప్పిన సమయానికి వైద్యశాల నిర్మాణం పూర్తయింది. ప్రారంభోత్సవానికి జమీందారు సతీసమేతంగా విచ్చేశాడు. ఒకసారి వైద్యశాలను తిరిగి చూసిన జమీందారు, ''దీని నిర్మాణం ఎవరి ఆధ్వర్యంలో జరిగింది? రోగుల పడక గదులలో అసలు గాలి రావడం లేదు. ఒకటి ఉండవలసిన చోట వేరొకటి ఉన్నది,'' అన్నాడు కోపంగా.

''వైద్యశాల నిర్మాణ బాధ్యతలను ప్రత్యేక అధికారికి అప్పగించాను,'' అన్నాడు దివాను.

ప్రత్యేక అధికారి, ''భవన నిర్మాణం పనులు చూసే అధికారే దాని నిర్మాణ బాధ్యతలు వహించాడు,'' అన్నాడు. ''నాకు ఇతర పనులు ఉండడం వల్ల, ఈ వైద్యశాల నిర్మాణ బాధ్యతలను నా సహాయకుడు మణికంఠుడికి అప్పగించాను,'' అంటూ నిర్మాణ పనుల పర్యవేక్షకుడు అతడి కేసి చేయి చూపాడు. దగ్గరికి వచ్చిన మణికంఠుణ్ణి జమీందారు కోపంగా చూశాడు.

''ప్రభువులు క్షమించాలి. ఈ వైద్యశాలకు రూపకల్పన చేసిన రోజు నుంచి, పెద్దల పర్యవేక్షణలో వందలాది మంది రాత్రింబవళ్ళు కష్టపడి పనిచేయడం వల్లే సకాలంలో ఈ భవన నిర్మాణం పూర్తయింది. నిర్మాణంలో నాకు తెలిసినంత వరకు ఎలాంటి లోపాలూ లేవు. ఉన్నట్టు ప్రభువులకు అనిపిస్తే అందుకు పూర్తి బాధ్యత నేనే వహిస్తున్నాను. ఎలాంటి శిక్ష విధించినా అనుభవించడానికి సిద్ధంగా ఉన్నాను,'' అన్నాడు మణికంఠుడు వినయంగా.

ఆ మాటతో జమీందారు ముఖం వికసించింది. ''పొగడ్తల కయితే అందరూ ఎగబడతారు. విమర్శలను ఎవరూ సహించరు. అద్భుతమైన ఈ వైద్యశాల భవన నిర్మాణానికి బాధ్యతాయుతంగా పనిచేసిన వారెవరో తెలుసుకోవాలనే అలా చేశాను,'' అంటూ జమీందారు వెయ్యి బంగారునాణాలతో మణికంఠుణ్ణి సత్కరించాడు.

– ఉమా శ్రీధరన్





Birthday పుట్టినరోజు பிறந்தநாள் Tamil పిరందనాళ్

# Avail the Coolest Combo Pack!i




## Buy Chandamama's Collector's Edition+Ramayana for Rs ~~898~~ 673* Only!



Chandamama's Ramayana is the first fully Illustrated Ramayana which comes in a single book.



Chandamama Collector's Edition features the best of Chandamama published over the last 60 years.

---

I want the Coolest Combo Pack:

Name.................................................... Subscriber No ....................................................

Address....................................................................................................................

City .......................................... State .......................................... Pin ..........................................

Telephone .......................................... Mobile .......................................... Email ..........................................

Enclosed Cheque/DD for Rupees (in words) ....................................................................

Cheque/DD no .......................................... Favouring Chandamama India Ltd

on .................................................................................. bank. *(Send At-Par cheques or add Rs 60 for non-Chennai cheques)*

Please mail the order form to :

Chandamama India Limited, No. 2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelangarai, Chennai – 600 041. Phone: (044) 43992828

Email: chandamama@chandamama.com Web: www.chandamama.com

Both these titles are available only in English at all leading bookshops.

To place an order go to www.chandamama.com

*For purchase outside India, the Coolest Combo Pack is available at $~~100~~ $80

Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

Because stories make the world go round...

**Choose your Chandamama!**

Go to www.chandamama.com or SMS CSHOP to 54646 & we'll get in touch with you!

Subscribe Now!!



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..................................................................................

Date of Birth: ................................ Sex :................................

Address: ..................................................................................

..................................................................................

..................................................................................

.............................................. City: ..................................

State:...................................... Pin:............................................

Telephone:..................................................................................

Mobile:..................................................................................

Email:..................................................................................

Subscription Number 9for renewals):..........................................

Gift Subscription to the following address:

..................................................................................

..................................................................................

..................................................................................

..................................................................................

Enclosed Cheque/DD* for Rupees..............................................

Cheque/DD No ..................................................................

favouring Chandamama India Ltd on.......................................

..................................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.



## వీసా దేవుడు




వర్ధమాన దేశాలలో పలువురికి అమెరికాకు వెళ్ళడం అన్నది అందమైన కల. ఇవాళ్టి రోజుల్లో అమెరికా వీసా లభించడం చాలా కష్టంగా మారుతోంది. అయితే, ఈ సమస్యకూ ఎప్పటిలాగే భారతీయ ధోరణిలోనే కొందరు పరిష్కారం కనుగొంటున్నారు. ఆయనే వీసా దేవుడు!

హైదరాబాద్ నుంచి 25కి.మీ. దూరంలో వికారాబాద్ రోడ్డు మీదుగా ఉస్మాన్ సాగర్ తీరంలో చిలుకూరు బాలాజీ దేవాలయం ఉన్నది. ఇక్కడి వేంకటేశ్వరస్వామి దర్శనం కోసం రోజూ వేలాదిమంది భక్తులు వస్తూ ఉంటారు. ఈ దేవుణ్ణి దర్శించి మనసారా ప్రార్థిస్తే, వీసాలు నిరాకరించబడడం అనేది ఉండదని భక్తులు విశ్వసిస్తారు. వారానికి దాదాపు లక్షమంది భక్తులు ఈ దేవుణ్ణి దర్శించుకుంటారు.

## కుట్టని తేళ్ళు

తేలు కుడితే కొండెంలోని విషం ఒక్కోసారి మరణాంతకం అవుతుంది. బాధ మాత్రం భరించలేనంతగా ఉంటుంది. అయితే కుట్టడం అంటూ చేయని తేళ్ళు కూడా ఒకచోట ఉన్నాయి! ఉత్తరప్రదేశ్‌లోని అమ్రోహా నగరంలో సూఫీ సన్యాసి పీర్ షా విలాయత్ మసీదులో ఇలాంటి తేళ్ళు కనిపిస్తాయి. ఇక్కడి తేళ్ళు కుట్టకుండా ఉండడానికి కారణం తెలిపే ఉదంతం ఒకటి ప్రచారంలో ఉంది. షా విలాయత్ సజీవుడై ఉన్నప్పుడు, ఆయన విధానాలు నచ్చక స్థానిక పాలకుడు ఆయన్ను ఆ చోటును వదిలి వెళ్ళిపొమ్మన్నాడు. అయితే ఆయన వెళ్ళడానికి నిరాకరించాడు. పాలకుడు ఆగ్రహంతో ఆయన్ను అక్కడి నుంచి హడలగొట్టి తరమడానికి తేళ్ళను తెప్పించి వదిలాడు. అయితే, సన్యాసి తేళ్ళతో సహజీవనం ప్రారంభించాడు! ఆయన ఆధ్యాత్మిక శక్తుల కారణంగా తేళ్ళు ఆయన్ను ముట్టుకోలేదు. ఆ రోజు నుంచి అక్కడికి వచ్చే వాళ్ళెవరినికూడా తేళ్ళు కుట్టడం లేదని భక్తులు విశ్వసిస్తున్నారు.





| Birthday | పుట్టినరోజు | জন্মদিন | Bengali | జన్మదిన్ |
|---|---|---|---|---|



# మన చరిత్ర పుటల నుంచి

## ఎదురు చూసిన అద్భుతం!

*క్రీ.శ. 454, రాజభవనం, పాటలీపుత్ర నగరం, గుప్త సామ్రాజ్యం.*

“చివరిసారిగా అడుగుతున్నాను. నువ్వు నన్ను రాజుగా పట్టాభిషిక్తుణ్ణి చేస్తావా? లేదా?” అని కోపంగా అడిగింది ఓ దుందుడుకు కంఠస్వరం.

“రాజు ఎవరన్నది నిర్ణయించేసమయం, స్థలం ఇది కాదన్న విషయం నువ్వుతెలుసుకోవాలి పురూ,” అంటూ అనునయంగా చెబుతూ చక్రవర్తి కుమార గుప్తుడు సేనాధిపతి కేసి నిస్సహాయంగా చూశాడు.

యువకుణ్ణి పరిశీలిస్తున్న విదేశాంగమంత్రి, “చక్రవర్తి చెబుతున్నది నిజమే. పుష్యమిత్ర దురాక్రమణదారులు దుశ్చర్యలకు పూనుకుంటున్నారన్న విషయం అందరూ ఎరిగినదే కదా....” అన్నాడు.

ఆ మాటకు అడ్డు తగులుతూ పురుగుప్తుడు, “చక్రవర్తి జ్యేష్ఠ కుమారుడిగా సింహాసనాన్ని అధిష్ఠించడానికి నాకు ఎలాంటి అభ్యంతరమూ ఉండదు కదా?” అన్నాడు.

వృద్ధ చక్రవర్తి లేచి నిలబడి, “దయచేసి నాతో సభామంటపానికి మీరందరూ రండి. నా నిర్ణయాన్ని నా ప్రజలు వినడం అన్ని విధాలా న్యాయంగా ఉంటుంది,” అన్నాడు.

పురుగుప్తుడి ముఖం జేవురించింది. తక్కిన వారు వినయంగా వంగి నమస్కరించారు.

విశాలమైన సభామంటపం ప్రముఖులతో, సాధారణ ప్రజలతో క్రిక్కిరిసి ఉన్నది. చక్రవర్తి కుమారగుప్తుడు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళి సింహాసనంలో కూర్చున్నాడు. ఆ తరవాత లేచి నిలబడి సుదీర్ఘ కాలం సిరిసంపదలతో ముందుకు నడిపించిన తన ప్రజలను ఒకసారి పరిశీలనగా చూసి ఇలా అన్నాడు:

“ప్రియమైన ప్రజలారా, మా ముత్తాతమొదటి చంద్రగుప్తుడు రెండు రాజ్యాలను కలుపుకున్నప్పుడు, ఆయన పాలించిన ప్రాంతాలు చిన్నవే. అయినా, ఆయన ఎంతో గొప్పగా పరిపాలించాడు.



ఆ తరవాత మా తాతలు రాజ్య సరిహద్దులను విస్తరించారు. విశాల సామ్రాజ్యాన్ని స్థాపించారు. చీనాతో వ్యాపారసంబంధాలు, పర్షియాతో మైత్రీ సంబంధాలు పెంపొందించుకుని భరత వర్ష పరిరక్షణోద్యేయంగా పరిపాలన సాగించారు.”

ప్రజల హర్షధ్వానాలు మిన్నంటాయి. ఆ తరవాత ఆయన మళ్ళీ ఇలా అన్నాడు: “అయితే, ఇటీవల మా విజయాలను చూసి అసూయాగ్రస్తులైన వారు దొంగ చాటుగా చొచ్చుకుని వస్తూ, పంటలను



నాశపరుస్తూ, ప్రజలను హతమారుస్తూ, పట్టణాలను దోచుకుంటూ పలు దుండగాలకు పాల్పడుతున్నారు. వాళ్ళ బెడదను ఎదుర్కోవడానికీ, వాళ్ళను అణచడానికీ మేమెంతో ప్రయత్నించాం. అయినా బెడద తప్పడం లేదు. వాళ్ళ దొంగచాటు తాకిడిని ఎదుర్కోలేకపోతున్నాం. త్వరలో వాళ్ళు పాటలీపుత్రం మీదికి దండెత్తి రాగలరన్న బలమైన వదంతులు కూడా వినిపిస్తున్నాయి. ఈ విపత్కర పరిస్థితి నుంచి బయట పడాలంటే ఏదైనా ఒక అద్భుతం జరిగి తీరాలి.''

సభలో భయంకరమైన నిశ్శబ్దం చోటు చేసుకున్నది.

''ఇలాంటి పరిస్థితుల్లో రాజ్యాన్ని చక్కగా పరిపాలించగల వారసుణ్ణి ఎంపిక చేయడంలో గుప్త చక్రవర్తులు గౌరవించి ఆచరించిన ఒకసత్సంప్రదాయం ఉన్నది. విద్య, వివేకం, సమర్థత, నాయకత్వ లక్షణాలు గల ఉత్తమ యువకుణ్ణి వారసుడిగా నిర్ణయిస్తారు. అందువల్ల ప్రస్తుతం యౌవరాజుగా....'' అంటూ ఆగాడు.

అందరిలోనూ చెప్పరాని ఉత్కంఠ! పురుగుప్తుడు ఊపిరిబిగబట్టి వింటున్నాడు!

''స్కందగుప్తుణ్ణి నియమిస్తున్నాను.''

అంతవరకు వెనకవైపు మౌనంగా ఉన్న పొడవాటి యువకుడు విస్మయం చెందాడు.

''నేను ఒప్పుకోను!'' అంటూ కీచుగొంతుతో అరుస్తూ లేచి నిలబడ్డాడు పురుగుప్తుడు.

''స్కందగుప్తుడు చక్కగా పరిపాలించగలడని మంత్రులతో పాటు నేనూ దృఢంగా విశ్వసిస్తున్నాను,'' అన్నాడు చక్రవర్తి.

''ఇంతకుముందెన్నడూ ఏ యుద్ధంలోనూ అతడు తన సామర్థ్యాన్ని నిరూపించుకోలేదు కదా? అలాంటప్పుడు మన ప్రజలు అతణ్ణి రాజుగా



ఎలా అంగీకరించగలరు?'' అని పురుగుప్తుడు ప్రజల కేసి తిరిగి, ''నా మాట వినండి. ఇందుకు నేను ఒకే ఒక పరీక్ష పెట్టాలనుకుంటున్నాను,'' అన్నాడు.

అందరూ మౌనంగా అతడి కేసి చూశారు.

''పుష్యమిత్ర తెగలను ఓడించినట్టయితే, స్కందగుప్తుడు చక్రవర్తి కావడానికి నాకెలాంటి అభ్యంతరమూ లేదు. మనస్ఫూర్తిగా స్వాగతిస్తాను. ఒకవేళ ఓడిపోయాడో రాజ్యం నుంచి అతణ్ణి బహిష్కరించాలి,'' అన్నాడు పురుగుప్తుడు.

సభలో గుసగుసలు ప్రారంభమయ్యాయి. ఆ తరవాత అవి రణగొణ ధ్వనులుగా మారడంతో పురుగుప్తుడు విజయగర్వంతో నవ్వసాగాడు!

చక్రవర్తి, ''అదే అతనికి పరీక్ష అయినట్టయితే నిలబడక తప్పదు కదా?'' అన్నాడు.

సేనాధిపతి స్కందగుప్తుడి చేయి పట్టుకుని సింహాసనం దగ్గరికి తీసుకువెళ్ళి చేయెత్తి, ''యౌవరాజు స్కందగుప్తుడు వర్ధిల్లాలి!'' అన్నాడు.



**Birthday** పుట్టినరోజు ಹುಟ್ಟಿದದಿನ **Kannada** ಹುಟ್ಟಿದದಿನ



చక్రపాలితుడికి భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉంది. అతడి మనసు విషాదంతో నిండిపోయింది. 'నెలల తరబడి మనం పుష్యమిత్ర తెగలతో పిల్లీ-ఎలుకల్లా దాగుడుమూతలు ఆడుతూనే ఉన్నాం. మనం సాధించింది ఈ మట్టి కాలువగట్టు మీది స్థానాలే. ఇవి చాలవని నువ్వు మనం దరిలోకి చక్కటి శక్తియుక్తులు గల చాకుల్లాంటి ఐదుగురు వీరసేనుడి అనుచరులను ఇంటికి పంపేశావు!'' అన్నాడు.

''వీరసేనుడు గాయపడ్డాడు. అయినా, మనం శత్రుసైనికుల సంఖ్యను చాలావరకు తగ్గించగలిగాం. ఈ స్థావరాలకు ఆహారాన్నీ, సుదర్శన సరోవరం నుంచి నీటినీ అందిస్తున్న నీకు ఎంతో ఋణపడి ఉన్నాను,'' అంటూ స్కందగుప్తుడు గిర్నార్ కొండలకేసి చూశాడు. అక్కడే చంద్రగుప్త మౌర్యుడి కాలంలో నిర్మించబడిన బ్రహ్మాండమైన సుదర్శన సరోవరం ఉన్నది.

సభలో హర్షధ్వానాలు బయలుదేరాయి. ''చక్రవర్తి కుమారగుప్తుడు వర్ధిల్లాలి!'' అన్న నినాదాలు సభాప్రాంగణంలో మారుమ్రోగాయి.

* * *

*క్రీ.శ. 455, కథియవాడ్, గిర్నార్ కొండల పాదతలం.*

రాత్రి ఆకాశం నిండా చుక్కలు మిలమిలా మెరుస్తున్నాయి. దూరంలో భూమ్యాకాశాలు కలిసే చోట ముదురు నీలంరంగు నీడల్లా కొండల వరుసలు వ్యాపించి ఉన్నాయి.

''మనం ఇక్కడ ఎందుకు కూర్చున్నామో నాకు ఇంకా అంతుబట్టడం లేదు,'' అన్నాడు సురాష్ట్ర నగర పాలకుడు చక్రపాలితుడు. స్కందగుప్తుడు ఎదుర్కొంటూన్న పరీక్ష గురించి అతనికి తెలియవచ్చింది. బాల్యమిత్రుడిగా అతడికి సాయమందించడానికి వచ్చాడు.

''నాకు ఆశ్చర్యంగా ఉంది. అన్నీ నన్నే అడుగుతావేం? ఇది ఇంతకూ నీ ప్రాంతమే కదా? నీ మెదడుకు కాస్త పని కల్పించు,'' అని సలహా ఇచ్చాడు బాల్యస్నేహితుడు. స్కందగుప్తుడు, చక్రపాలితుడు పంటకాలువ మట్టిగట్టు మీద కూర్చుని ఉన్నారు. చుట్టూ పంటపొలాలు విస్తరించి ఉన్నాయి.

''మనమూ తరుముతున్నాం. వాళ్ళూ మనల్ని తరుముతున్నారు. శత్రువులను పట్టి బంధించడానికి అక్కడక్కడ వలలు పన్నుతున్నాం. అయినా ప్రయత్నాలు ఫలించడం లేదు. పాటలీపుత్రం అదనంగా సేనలు పంపడం లేదు,'' అన్నాడు చక్రపాలితుడు.

''నేను విజయం సాధించకూడదన్నది పురుగుప్తుడి ఆశ. అందుకు అతడి కారణాలు అతడికి ఉంటాయి. అతణ్ణి తప్పు పట్టి నిందించలేము కదా? చిట్టడవుల పొడవునా పొంచి ఉన్న పుష్యమిత్ర తెగల గురించే మనం దృష్టిని సారించడం అవసరం,'' అన్నాడు స్కందగుప్తుడు.

చంద్రపాలితుడు అక్కడి నుంచి లేచాడు. అతనితో పాటు అక్కడ వారితో ఉన్న కొద్దిపాటి



Birthday పుట్టినరోజు ଜନ୍ମଦିନ Oriya జన్మదిన

సైనికులు కూడా లేచారు. వాళ్ళు వందల్లోనే ఉన్నారు. వాళ్ళమీదికి వేగంగా వస్తూన్న శత్రు సైనికులు వేల సంఖ్యల్లో ఉన్నారు. శత్రుబలాన్ని తలుచుకుంటే ఓటమి తప్పదేమోనన్న అనుమాన భయం అలముకోసాగింది.

''యుద్ధానికి సన్నద్ధులు కండి!'' అన్నాడు చక్రపాలితుడు వస్తూన్న సేనలను చూసి.

''ఆగండి! వాళ్ళను వీలైనంత దగ్గరికి రానివ్వండి,'' అని ఆజ్ఞాపించాడు స్కందగుప్తుడు. అతనికి కుడివైపున గిర్నార్ కొండలు ఆ ప్రాంతానికి పెట్టని కోటల్లా పరిరక్షిస్తున్నాయి. కత్తులు కటారుల కదలికలు, అరుపులు, కేకలు వినిపించసాగాయి.

''దేనికోసం ఆగాలి?'' అని అరిచాడు చక్రపాలితుడు.

స్కందగుప్తుడు కొండల కేసి చూపుతూ, ''దానికోసం!'' అన్నాడు.

చీకట్లో మెరుపు మెరిసినట్టయింది.

కొద్ది నిమిషాల నిశ్శబ్దం. ఆ తరవాత భయంకరమైన అరుపులు. భూమి కంపించినట్టయింది. పక్షులు అరవసాగాయి. జంతువులు అరుస్తూ అటూ ఇటూ పరిగెత్తసాగాయి. సముద్రమే కట్టలు తెంచుకున్నట్టు ప్రళయభీకర ప్రవాహం ఆ ప్రాంతాన్ని ముంచెత్తింది.

''ఏమిటది?'' అని అడిగాడు చక్రపాలితుడు అమితాశ్చర్యంతో.

''మనం ఎదురుచూస్తూన్న అద్భుతం జరగనున్నది. రండి. ఎత్తయిన ప్రాంతానికి చేరుకోవాలి!'' అంటూ స్కందగుప్తుడు చంద్రపాలితుణ్ణీ, తన సైనికులనూ పిలిచాడు.

క్షణాల్లో వాళ్ళు ఎత్తయిన ప్రాంతంలోని వృక్షాల మీదికి ఎక్కారు. పుష్యమిత్ర తెగల వీరులు, వారి ఆయుధాలు, దివిటీలు వెల్లువల పాలయ్యాయి. పొలాల్లోని శత్రుసైనికులను వెల్లువ ముంచి కొట్టుకుపోయింది. జలప్రవాహం ధాటికి వాళ్ళ ఆయుధాలు ఎందుకూ కొరగాకుండా పోయాయి. నిమిషాల్లో ఉన్న చోటు తెలియకుండా కొట్టుకుపోయారు.

''హరి, భగవంతుడా!'' అంటూ ఆ ప్రళయాన్ని చూసి ఆశ్చర్యపోయిన చంద్రపాలితుడు, ''ఇదెలా జరిగింది? ఎవరు చేశారు?'' అని అడిగాడు.

''వీరసేనుడు, అతడి అనుచరులు ఇళ్ళకు తిరిగి వెళ్ళలేదు. సుదర్శన సరోవరం గట్టును తెగగొట్టి, నాకు సంకేతం పంపమన్నాను. శత్రు సైనికులను ఊరించి దగ్గరికి రప్పించామంటే వాళ్ళు ప్రవాహంలో కొట్టుకు పోగలరని నాకు తెలుసు. అయినా, సరోవరానికి వాటిల్లిన నష్టం బాధ కలిగిస్తోంది!'' అన్నాడు స్కందగుప్తుడు.

''దానిని మళ్ళీ నిర్మిద్దాం. అంతకన్నా ఆనందకరమైన పని మరొకటి లేదు,'' అన్న చంద్రపాలితుడు, మందహాసంతో, ''భరత వర్ష పరిరక్షకుడు స్కందగుప్త చక్రవర్తికి అభినందనలు,'' అంటూ వంగి నమస్కరించాడు. –పవిత్రా శ్రీనివాసన్





Birthday పుట్టినరోజు ශිෂ්‍ය Gujarati શિક્ષક



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరువాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

| |  |  |  |  |  |
|---|---|---|---|---|---|
| **English** | **Cycle** | **Sun** | **Teacher** | **Birthday** | **Doctor** |
| **Telugu** | సైకిలు | సూర్యుడు | ఉపాధ్యాయుడు | పుట్టినరోజు | వైద్యుడు |
| **Hindi** | साइकिल<br>సాయికిల్ | सूरज<br>సూరజ్ | अध्यापक<br>అధ్యాపక్ | जन्मदिन<br>జన్మదిన్ | चिकित्सक<br>చికిత్సక్ |
| **Tamil** | மிதிவண்டி<br>మిదివండి | சூரியன்<br>సూరియన్ | ஆசிரியர்<br>ఆసిరియర్ | பிறந்தநாள்<br>పిరందనాళ్ | மருத்துவர்<br>మరుత్తువర్ |
| **Bengali** | সাইকেল<br>సాయికేల్ | সূর্য<br>సూర్జ్య | শিক্ষক<br>శిక్షక్ | জন্মদিন<br>జన్మదిన్ | চিকিৎসক<br>చికిత్సక్ |
| **Marathi** | सायकल<br>సాయ్‌కల్ | सूर्य<br>సూర్య | शिक्षक<br>శిక్షక్ | वाढदिवस<br>వాఢదివస్ | वैद्य<br>వైద్య |
| **Kannada** | ಸೈಕಲ್ಲು<br>సైకల్లు | ಸೂರ್ಯ<br>సూర్య | ಉಪಾಧ್ಯಾಯ<br>ఉపాధ్యాయ | ಹುಟ್ಟಿದದಿನ<br>హుట్టిదదిన | ವೈದ್ಯ<br>వైద్య |
| **Oriya** | ସାଇକେଲ<br>సాయ్‌కేల్ | ସୂର୍ଯ୍ୟ<br>సూర్జ్య | ଶିକ୍ଷକ<br>శిఖ్యక్ | ଜନ୍ମଦିନ<br>జన్మదిన | ଡାକ୍ତର<br>డాక్తర్ |
| **Gujarati** | સાયકલ<br>సాయ్‌కల్ | સૂર્ય<br>సూర్య | શિક્ષક<br>శిక్షక్ | જન્મદિવસ<br>జన్మదివస్ | ડોક્ટર<br>డోక్టర్ |
| **Assamese** | চাইকেল<br>సాయికేల్ | সূৰ্য<br>హూర్జ్య | শিক্ষক<br>హిఖ్ఖక్ | জন্মদিন<br>జన్మదిన్ | ডাক্তৰ<br>డాక్తర్ |
| **Malayalam** | സൈക്കിൾ<br>సైకిళ్ | സൂര്യൻ<br>సూర్యన్ | അധ്യാപകൻ<br>అధ్యాపకన్ | ജന്മദിനം<br>జన్మదినం | ഡോക്ടർ<br>డోక్టర్ |
| **Santali** | ᱫᱩᱞᱩᱝ<br>డులుం | ᱥᱤᱧ ᱪᱟᱸᱫᱚ<br>శిఞ్ చాందో | ᱢᱟᱪᱮᱛ<br>మాచేత్ | ᱡᱟᱱᱟᱢ ᱢᱟᱦᱟ<br>జానాం మాహా | ᱰᱟᱠᱴᱚᱨ<br>డాక్టోర్ |
| **Sanskrit** | द्विचक्रिका<br>ద్విచక్రికా | सूर्यः<br>సూర్యః | शिक्षकः<br>శిక్షకః | जन्मदिनम्<br>జన్మదినం | वैद्यः<br>వైద్యః |



కింద ఇచ్చిన ఐటలిక్స్‌లోని పదాలను గమనించండి. పై జాబితా సహాయంతో వాటి అర్థాలకు అనుగుణంగా ఖాళీలను నింపండి!

1. నేను *డులుం*లో బడికి వెళతాను లేదా ...............
2. *హూర్జ్య* .................. కేంద్రం.



**Birthday** పుట్టినరోజు जन्मदिन **Assamese** జన్మదిన్







| English | Room | Tree | Monkey | Garden | Sea |
|---|---|---|---|---|---|
| Telugu | గది | చెట్టు | కోతి | తోట | సముద్రం |
| Hindi | कमरा<br>కమ్‌రా | पेड़<br>పేడ్ | बन्दर<br>బందర్ | बगीचा<br>బగీచా | समुद्र<br>సముద్ర్ |
| Tamil | அறை<br>అఱై | மரம்<br>మరమ్ | குரங்கு<br>కురంగు | தோட்டம்<br>తోట్టం | கடல்<br>కడల్ |
| Bengali | ঘর<br>ఘర్ | গাছ<br>గాచ్ | বান্দর<br>బాందర్ | বাগান<br>బాగాన్ | সমুদ্র<br>సముద్ర |
| Marathi | खोली<br>ఖోలీ | झाडे<br>ఝాడే | माकड<br>మాకడ్ | बाग<br>బాగ్ | समुद्र<br>సముద్ర |
| Kannada | ಕೋಣೆ<br>కోణే | ಮರ<br>మర | ಕೋತಿ<br>కోతి | ಉದ್ಯಾನ<br>ఉద్యాన | ಸಮುದ್ರ<br>సముద్ర |
| Oriya | କୋଠରି<br>కోఠరి | ଗଛ<br>గఛ | ମାଙ୍କଡ<br>మాంకడ్ | ବଗିଚା<br>బగిచా | ସମୁଦ୍ର<br>సముద్ర |
| Gujarati | ઓરડો<br>ఓర్డో | વૃક્ષ<br>వృక్ష | વાંદરા<br>వాంద్రా | બગીચો<br>బగీచో | દરિયો<br>దరియో |
| Assamese | কোঠা<br>కోఠా | গছ<br>గఛ్ | বান্দৰ<br>బుందర్ | বাগিচা<br>బుగిచా | সাগৰ<br>సాగర్ |
| Malayalam | മുറി<br>ముఱి | വൃക്ഷ<br>వృక్ష | കുരങ്ങ്<br>కురంగు | പൂന്തോട്ടം<br>పూన్తోట్టం | കടൽ<br>కడల్ |
| Santali | [illegible]<br>కుఠి | [illegible]<br>దారేకో | [illegible]<br>గాఢీ | [illegible]<br>బాగాన్ | [illegible]<br>దోరేయా |
| Sanskrit | प्रकोष्ठः<br>ప్రకోష్ఠః | वृक्षः<br>వృక్షః | वानरः<br>వానరః | उद्यानम्<br>ఉద్యానమ్ | सागरः<br>సాగరః |

3. నా అభిమాన అధ్యాపకన్ ......................
4. నా వాఢదివస్ ......................
5. మా కుటుంబ వైద్యః ......................
6. నేను నా గదిని ...................... తో పంచుకుంటాను.
7. ప్రతి పుట్టిన రోజుకూ మరను నాటి .................... తగ్గించండి.
8. ........................ ణ్ణి వాంద్రా-దేవుడని కూడా పిలుస్తాం.
9. నా తోట్టంలో ........................ పువ్వులు ఉన్నాయి.
10. ........................ ఉన్నప్పుడు మత్స్యకారులు సముద్రలోకి వెళ్ళకూడదు.





| Birthday | పుట్టినరోజు | ജന്മദിനം | Malayalam | జన్మదినం |
|---|---|---|---|---|

# పాతాళదుర్గం - 17



[కాలశంబర మాంత్రికుడు, ధూమకుడూ వాళ్ళను కొండశిఖరం మీదికి తీసుకుపోయాడు. అక్కడ ఒక సరోవరతీరంలో రాకుమార్తె కాంతిసేన కనిపించింది. ఆమె పారిపోకుండా కాపలాకాస్తున్న కుంభీరుడు, మాంత్రికుడు అనుచరులతో ఆ ప్రాంతాలకు వచ్చినట్టు గ్రహించి, వాళ్ళున్న చోటుకు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వేగంగా రాసాగాడు. - తరవాత]

కుంభీరుడు తామున్న ప్రదేశం కేసి వస్తున్నట్టు అనుమానం కలగ్గానే, ధూమకుడు చప్పున కత్తి దూసి, ''మహామాంత్రికా! కుంభీరుడికి మన రహస్యం తెలిసిపోయింది. వాడిటే వస్తున్నాడు. ఇతర రాక్షసులకు హెచ్చరిక ఇవ్వకముందే వాణ్ణి యమలోకానికి పంపటం అవసరం,'' అన్నాడు.

మాంత్రికుడా మాటలకు నవ్వి, ''ధూమకా, తొందరపడకు. కుంభీరుడు మనపక్షంలోని వాడే. వాడు రావణుడి పాలిటి విభీషణుడి వంటివాడు. వంశద్రోహులే కాలంలోనూ ఉంటూనే ఉంటారు!'' అన్నాడు.

కుంభీరుడు చెట్టు వద్దకు వచ్చి, దాని బోదెలో ఉన్న పెద్ద కంత దగ్గిరకు ఒక ఎండు మోడును లాక్కుని, దాని మీద కూర్చుంటూ, ''శంబరా! రాక్షసులవి పెద్ద చెవులు, వాళ్ళ శ్రవణశక్తి గొప్పది. కొద్ది దినాలుగా నువ్వు నమ్మకద్రోహం చేయబోతున్నావన్న అనుమానం నన్ను బాధిస్తున్నది. నేను మహాకలి సోదరుణ్ణి కాను; అందువల్ల విభీషణుణ్ణి ఎలా అవుతాను? వంశద్రోహం మాట! మాది రాహువంశం, వాడిది కేతువంశం. కనక, ఇక్కడ వంశద్రోహం ప్రసక్తే లేదు,'' అన్నాడు కోపంగా.

మాంత్రికుడతడి కేసి రెండడుగులు వేసి, చెట్టుబోదెనానుకుని నిలబడి, చిన్న గొంతుతో, ‘‘కొత్తగా వచ్చి చేరిన అనుచరులకు, నీ మీద విశ్వాసం కలిగేందుకు కొన్ని చిన్న అబద్ధాలు చెపుతున్నాను, నువ్వు అపోహపడకు. వాళ్ళు నిన్ను ఎరిగిన వాళ్ళే. కదంబరాజ్య కొండగుహల వద్ద రాకుమారికి నువ్వు చేసిన వాగ్దానం వాళ్ళు విని ఉన్నారు కూడా,’’ అన్నాడు.

ఆ మాట వింటూనే కుంభీరుడు చప్పున తలతిప్పి, ధూమక సోమకులకేసి చూసి, ‘‘ప్రాణాలతో వీళ్ళింత దూరం వచ్చారా? ఈ నల్లగరుడపక్షిగా డెవడు? ఈ ముఖం ఎక్కడో చూసినట్టున్నదే,’’ అన్నాడు.

‘‘చూసే ఉంటావు. ఆటవిక నాయకుడు విరూపుడు,’’ అన్నాడు కాలశంబర మాంత్రికుడు. విరూపుడూ, ధూమక సోమకులూ రాక్షసుడికి వంగి నమస్కారాలు చేశారు.

‘‘ఇదేరకం వినయం?’’ అంటూ కుంభీరుడు కనుబొమలు చిట్లించి, ‘‘శంబరా! నేను నా వంశగౌరవం కాపాడేందుకు నీకు సహాయం చేస్తానన్నాను. నువ్వు నమ్మకద్రోహివిగా ప్రవర్తించవు గదా?’’ అన్నాడు.

‘‘ఆ అనుమానం నీకెందుక్కలిగింది?’’ అని ప్రశ్నించాడు మాంత్రికుడు.

‘‘నేను వేయి కళ్ళతో అంతా గమనిస్తూనే ఉన్నాను. దారి పొడవునా నీ అనుచరులాడే ఆటలన్నీ నేనెరుగుదును. వాళ్ళ ప్రయత్నమేమిటి?’’ అన్నాడు కుంభీరుడు.

‘‘అది పరమరహస్యం. ఇప్పుడప్పుడే వెల్లడించేది కాదు. కాని, ఒకటి చెపుతున్నాను.



నీకూ, నీ వంశం వాళ్ళయిన పాతిక ముప్పై మంది రాక్షసులకూ ఎలాంటి ప్రమాదం రాకుండా చూసే బాధ్యత నాది,’’ అన్నాడు కాలశంబరుడు.

కుంభీరుడు మారు మాటాడకుండా, అసంతృప్తి వ్యక్తమయ్యే ధోరణిలో తలాడిస్తూ, చెట్టుబోదె దగ్గిర నుంచి సరోవర తీరానికి వెళ్ళిపోయాడు. మాంత్రికుడు బోదెలో ఉన్న కంతను ఎప్పటిలా మూసి, దీర్ఘాలోచనలో ఉన్నవాడిలా తల వంచుకుని వెనుదిరిగి కొంత దూరం నడిచి, ‘‘భద్రా! ఏర్పాట్లన్నీ సక్రమంగా జరిగి పోతున్నయ్యా? మరో రెండు గంటల్లో చీకటి పడబోతున్నది. భస్మాలూ అవీ వాటి వాటి స్థానాల్లో చేర్చాలి. రాక్షసుల వ్యవసాయ జంతువులు–పులులూ, సింహాలూ, ఏనుగుల



Birthday పుట్టినరోజు जन्मदिनम् Sanskrit జన్మదినం



స్తంభన విద్యగాని తెలిసిన వాడెవడూ లేడు గదా?'' అన్నాడు భద్రుడు.

''ఆ బండరాతి జోలికి పోవద్దని లోగడే హెచ్చరించానుగదా? దాని విషయంలో చిన్నం యెత్తు పొరబాటు జరిగినా రాక్షసుల చావు అబద్ధం, మన చావు నిజం అవుతుంది. చీకటి పడనివ్వండి, దాని సంగతి చూస్తాను,'' అన్నాడు మాంత్రికుడు.

ఆ తరవాత అందరూ కొండ గర్భంలోని తమ నివాసానికి బయలుదేరారు. వాళ్ళు పై నుంచి సొరంగాల్లోకి ఉన్న మెట్లసోపానం దిగి వస్తూండగా, కొందరు మనుషులు మాంత్రికుడి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, ''మహా మాంత్రికా! సొరంగం గోడలవెంట పైనుంచి నీరు సన్నని ధారలుగా కారుతున్నది. మన నివాసాలు నీట మునిగే ప్రమాదం లేదు కదా?'' అన్నారు.

మాంత్రికుడు ఒక క్షణకాలం నిర్విణ్ణపోయి, అంతలోనే తెప్పరిల్లి గబగబా మెట్లు దిగి సొరంగ నివాసాల్లో ప్రవేశించాడు. అక్కడ గోడల మీద నీటిచారికలు కనిపించినై. మాంత్రికుడు ఒకచిన్న పాత్రతెప్పించి, అందులోకి ఆ నీటిని పట్టించి, తన అనుచరుల్లో ఒకణ్ణి తాగమన్నాడు.

''రుచెలా ఉన్నది? ఉప్పునీరా? తీపి నీరా?'' అని ప్రశ్నించాడు మాంత్రికుడు.

''తియ్యగా ఉన్నది,'' అన్నాడు వాడు.

''అంటే... మన జలపాతంలోని నీరులాగానా?'' అన్నాడు మాంత్రికుడు. వాడు అవునన్నట్టు తల ఊపాడు.

మాటేమిటి? వాటికి ఈ రాత్రి నుంచే ఉపవాసం ప్రారంభమవుతుంది గదా? కుంభీరుడి అనుచరులు వాటిని రేపు మధ్యాహ్నం వరకూ అదుపులో పెట్టి, వేటకు వదలగలరా?'' అని అడిగాడు.

''అంతా సిద్ధం అవుతున్నది. ఎవరి స్థానాల్లో వాళ్ళు జాగరూకులుగా ఉన్నారు. ఓషధి భస్మాలన్నీ, ఈ రాత్రికి పాతాళదుర్గం చుట్టూ వున్న మహావృక్షాల కొమ్మ లెక్కబోతున్నవి. సాధువులైపోయిన సింహాలూ, ఏనుగులూ తిరిగి క్రూర మృగాలు కాబోతున్నవి. ఒక్క సరోవరం సంగతే మీరు చూడాలి. ఆ బండ రాయి ఉండవలసిన చోట, ఉండవలసిన తీరుగా ఉన్నదీ లేనిదీ పరీక్షించటం మా వల్ల కాలేదు. మాలో మంత్రవిద్యలుగాని, జల



| Doctor | వైద్యుడు | चिकित्सक | Hindi | చికిత్సక్ |
| --- | --- | --- | --- | --- |

‘‘మనకెలాంటి ప్రమాదం లేదు. అయినా ఒకరిద్దరు నీటిధారలు మరింత పెద్దవవుత వేమో గమనిస్తూ ఉండండి,’’ అంటూ మాంత్రికుడు భద్రుడి కేసి తిరిగి, ‘‘భద్రా! ఆ మోకులూ అవీ సిద్ధంగా ఉన్నవి కదా? ఇంక కొంచెం సేపట్లో నేను సరోవరం దగ్గిరికి బయలుదేరబోతున్నాను. నా వెంట ధూమక సోమకుల్నీ, విరూపుణ్ణీ తీసుకుపోతాను. ఇక్కడి ఏర్పాట్లన్నీ చూసే బాధ్యత నీది,’’ అన్నాడు.

సూర్యాస్తమయమై, కొండ మీద చీకట్లు అలముకోగానే కాలశంబరుడు, ధూమక సోమకుల్నీ, విరూపుణ్ణీ తోడుతీసుకుని గుహల్లో నుంచి కొండ మీదికి వెళ్ళాడు. అక్కడ ఒక చెట్టు కింద తీగలతో అల్లిన బల మైన పొడవాటి మోకులు చుట్టగా పడి ఉన్నాయి. ధూమకసోమకులూ, విరూపుడూ వాటిని ఎత్తి భుజాల మీద వేసుకున్నారు. వాళ్ళకు అంతా గొడవగొడవగా ఉన్నది. భద్రుడూ, మాంత్రికుడూ జరిపిన సంభా షణలో ఒక్క ముక్కయినా వాళ్ళకు అర్థం కాలేదు. ఈ మోకులూ, సరోవరం, బండ రాయి, జలస్తంభనం... అంతా అయోమ యంగా ఉన్నది. ప్రశ్నిస్తే, అంతా పరమ రహస్యం అంటున్నాడు కాలశంబరుడు!

ఆకాశంలో మిణుకు మిణుకుమనేచుక్కల కాంతిలో నలుగురూ నిశ్శబ్దంగా నడిచి, కొండమీది సరోవరాన్ని సమీపించారు. వాళ్ళు చేరిన ప్రాంతం, సాయంకాలం వేళ కుంభీర రాక్షసుడూ, రాకుమారి కాంతిసేనా విహరించి



పోయిన ప్రదేశానికి ఒక పక్కగా, పాతాళ దుర్గానికి కొంచెం దాపులగా ఉన్నది.

తీరం చేరగానే కాలశంబర మాంత్రికుడు నీటిలో మంత్రదండాన్ని సగం వరకూ ముంచి, ఏవో మంత్రాలు పఠిస్తూ చుట్టూ ఓమారు కలయచూశాడు. ఒడ్డున అనేకమైన మహా వృక్షాలు గాలి తాకిడికి అప్పుడప్పుడు వేగంగా కదలాడుతూ, కొమ్మలు ఒకదానికొకటి ఒరు సుకోగా కిర్రుకిర్రుమంటూ వికృతంగా ధ్వనులు చేస్తున్నవి.

మాంత్రికుడు మంత్రదండం పైకెత్తి ఆ మహావృక్షాల్లో ఒకదానిని ధూమక సోమకు లకు చూపుతూ, ‘మోకు ఒకకొసను ఆ చెట్టు కాండానికి కట్టి, రెండవ కొస నా చేతికివ్వండి. నేను సరోవరంలో ప్రవేశించబోతున్నాను.



పుడి భుజం మీంచి కిందికి దూకి, కాళ్ళతో నేలను గీరుతూ కీచుమంటూ అరిచి పైకె గరబోయింది. ధూమకుడు ముందుకు వంగి పక్షికాలున వేళాడుతున్న తాడును గట్టిగా పట్టుకుని, ''విరూపా! దీన్ని పారిపోకుండా పట్టుకో. దీనితో అవసరం రావొచ్చు,'' అన్నాడు.

''పారిపోకుండా పట్టుకోవటమా! ఇది నన్నొదిలి ఎక్కడికి పోతుంది?'' అంటూ విరూపుడు నల్లగరుడపక్షిని రెండు చేతులతో పట్టుకుని ఎత్తి భుజాన పెట్టుకుంటూ, ''మాంత్రికదొర ఇంతసేపైనా నీట్లో నుంచి బయిటికి రాలేదేం?'' అన్నాడు.

''అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఎంత జల స్తంభన విద్య తెలిసిన వాడైనా నీటి అడుగున ఇంతసేపుండగలడా? అతడికేదైనా ముప్పు జరిగివుంటే, మనం అంతా రాక్షసుల చేతుల్లో హతం అయిపోతాం,'' అన్నాడు ధూమకుడు నిస్పృహగా.

వాళ్ళిలా మాట్లాడుకుంటూండగా కొండ దిగువ పాతాళదుర్గ ప్రాంతం నుంచి వాద్యాల మోతా, రాక్షసులు కాల్చే తారాజువ్వల వెలుగూ ధూమకుడూ వాళ్ళకు కనిపించింది.

''వాళ్ళప్పుడే జాతర ప్రారంభించారు,'' అన్నాడు విరూపుడు.

''అలాగే ఉన్నది. రేపు మధ్యాహ్నం వేళకు గదా, శశికాంతుణ్ణి వాళ్ళు శిరశ్ఛేదం చేయ బోయేది. అతణ్ణీ, కాంతిసేననూ ఆ దుర్మా ర్గుల బారి నుంచి మాంత్రికుడెలా కాపాడ గలడో నా కర్థంకావటం లేదు. మనం ఉండే కొండగర్భంలోని రహస్యసొరంగాలు తెలు

ఎంతసేపటికి తిరిగి వస్తానో చెప్పలేను. మీరు మాత్రం నిశ్శబ్దంగా ఇక్కడే కూర్చోండి,'' అని చెప్పి, ధూమకుడిచ్చిన మోకును అందుకుని, ''శాంభవీ!'' అంటూ చిన్నగా అరిచి దభా లున నీటిలోకి దూకాడు.

ధూమక సోమకులూ, విరూపుడూ నిశ్శ బ్దంగా కూర్చున్నారు. ఒక గంటకాలం గడి చింది. చెట్టుకొమ్మల్లో గుడ్లగూబ ఒకటి కర్ణ కఠోరంగా అరిచింది. విరూపుడి భుజాన అప్పటివరకూ కునికిపాట్లు పడుతున్న నల్ల గరుడపక్షి ఆ అరుపు వింటూనే చప్పున తల ఎత్తి రెక్కలల్లల్లాడిస్తూ కీ అంటూ కేక పెట్టింది. అంతలో ఒక పెద్ద గబ్బిలం దాని తల మీద బలంగా తన్ని, వేగంగా మానుకొమ్మల్లోకి ఎగిరిపోయింది. గరుడపక్షి రెచ్చిపోయి విరూ



| Doctor | వైద్యుడు | चिकित्सक | Bengali | చికిత్సక్ |
|---|---|---|---|---|



## మీ మనసులోని మాట చెప్పండి!

ఈ శీర్షికల్లో ఏది మీకు ఎక్కువ సమాచారం అందిస్తోంది?
a) చందమామ కబుర్లు b) ఉదయ తారలు c) భారత దర్శిని
మీ సమాధానాన్ని RYC <space> <a\b\c>54646కు SMS చెయ్యండి.

అక్టోబర్ 09 ఫలితాలు: a:85%; b: 15%

సుకుని, వాళ్ళే ముందుగా మనను హత మార్చవచ్చు. కుంభీరుడిలో నాకు నమ్మకం లేదు,'' అన్నాడు సోమకుడు.

''ఏం జరగటానికైనా అవకాశం ఉన్నది. మరో క్షణంలో మాంత్రికుడి శవం నీటిమీద తేలినా నేనాశ్చర్యపడను,'' అన్నాడు ధూమ కుడు.

అతడు మాట ముగించీముగించక ముందే సరోవరంలో చిన్న అలలు లేచినై. మరుక్షణం కాలశంబర మాంత్రికుడు ఒక చేత్తో మంత్ర దండం, మరొక చేత్తో బంగారంలాగా మిల మిలా మెరిసిపోతున్న చిన్న మొసలి పిల్లనూ పట్టుకుని నీటి మీదికి తేలి, ఒడ్డుకేసి వచ్చాడు. ధూమకుడూ వాళ్ళు ఉత్సాహంగా లేచి అతడి కేసి పరిగెత్తారు. మాంత్రికుడు చిరునవ్వు నవ్వుతూ వాళ్ళకు మొసలిపిల్లను చూపి, ''ఇది గొప్ప శుభసూచకం. బంగారు మొసళ్ళను మీరెక్కడా చూసివుండరు. ఇది కావాలని నాకు దొరికింది. దీన్నీ, నల్లగరుడ పక్షినీ ప్రయోగించి రేపు ఒక గొప్ప ఘన కార్యం సాధించబోతున్నాం,'' అన్నాడు.

ధూమకుడూ, అతడనుచరులూ, బంగారు మొసలిపిల్లకేసి చూస్తూ అద్భుతపడ్డారు. మాంత్రికుడు కొండకింద రేగిన గందరగోళ ధ్వనులు ఒక తృటికాలం విని, ''ఓహో, మహా కలిరాక్షసుడి పైతృకవర్ధంతికి ముహూర్తం సమీపించిందన్నమాట! జై, శాంభవీ!'' అంటూ చేతులు రెండూ పైకెత్తి, ''ఆ మోకులు చెట్టు బోదెకు గట్టిగా బిగించారు గదా? మహాకలి కాలశంబరుల మధ్య చావుబతుకుల యుద్ధం ప్రారంభమైంది,'' అంటూ తన రహస్య నివాసం కేసి బయలుదేరాడు. –*(ఇంకా ఉంది)*





| Doctor | వైద్యుడు | वैद्य | Marathi | वैद्य |
|---|---|---|---|---|

# ఋణానుబంధం

*[అంతరించిపోయిన ప్రాణుల అవని అనునిర్వలో మయూరి మాటే శాసనం. అక్కడ మొట్టమొదట అడుగుపెట్టిన మానవుడు శివ. మానవజాతి పాల్పడిన దురాగతాలకు దానిని క్షమించడానికి సుముఖంగా లేని రక్తదాహం గల యుద్ధమండలి వద్దకు మయూరి శివను వెంటబెట్టుకుని వెళ్ళింది.]*

నేను ఆమెకేసి చూశాను. ''నీకు నా కథ తెలుసా బాబూ?'' అని అడిగింది మయూరి సన్నటి భయంకరమైన కంఠస్వరంతో. మాటలు చిరుతల్లా గాలిలో దూసుకు వచ్చాయి. ఆమె సమాధానం కోసం ఆగలేదు. ''నీలాగే నేనూ భూమి మీదే ప్రాణం పోసుకున్నాను. అది ఎంతటి అద్భుతమైనది! మొగ్గనూ, శిశువునూ, గుడ్డునూ మేల్కొలపడానికి ప్రపంచమంతా ఒక్కటిగా పని చేస్తుంది. ఆ గుండె చప్పుడులోని ప్రాణం ఎంత కొత్తది! నిజంగానే ఎంతటి మహత్తరమైనది! శ్వాసించడం, రక్తం అంతటా ఏకత్వాన్ని కొనియాడడం! నేనూ మానవ మాతృగర్భంలో నును వెచ్చని సంతృప్తికరమైన నవనవ ప్రాణ స్పందనను ఆస్వాదించి అనుభవించాను...'' అంటూ ఆగింది మయూరి. తక్కిన ప్రాణులు మౌనంగా ఉన్నాయి. మమ్మత్ నేత్రాల నుంచి బాష్పాలు రాలాయి.



''నేను హాయిగా నిద్రపోయాను. ఎందుకంటే ఏవో దుష్టశక్తులు నన్ను వెలుపలికి గెంటేయగలవని నేను ఊహించలేకపోయాను. నేను భూమిలో అంతర్భాగం. నిజమే కదా? ఎవరో కావాలనుకున్నందునే నేను భూమి మీదికి వచ్చాను. కాదనగలరా? వాళ్ళు నేను అమాయకంగా నిదురపోతూ, భూమి మీదికి పడేంతవరకు నన్ను దుష్ట శక్తులన్నిటి నుంచీ, కాపాడాలి కదా?'' అన్నది ఆమె.

అయితే, ఇదంతా ఆమె నాకెందుకు చెబుతున్నదో నాకు అర్థం కాలేదు. ఆమె దుఃఖం కణకణలాడే నిప్పుకణికల్లా నన్ను స్పృశించడం వల్ల



| Doctor | వైద్యుడు | ವೈದ್ಯ | Kannada | వైద్య |
|---|---|---|---|---|

అలాగే వింటూ ఉండిపోయాను. ఎలాంటి పాపం చేయకపోయినా, అపరాధ భావంతో కుంచించుకు పోయాను. అయినా, అనుభవిం చవలసిందేననుకున్నాను.



''ఈ ప్రాణిరూపాలు!'' అంటూ ఆమె చేతులు పైకెత్తి తన ఆగ్రహ కారణానికి సాక్ష్యంగా నిలబడ్డ పెద్ద పెద్ద నీడలకేసి చూపుతూ చెప్పసా గింది: ''వాటిలో కొన్ని ప్రాణచక్రం పరిపూర్తి కావడంతో ఇక్కడికి వచ్చాయి. భూమి మార్పు చెందుతోంది. నూతన ప్రాణం వేళ్ళూనవలసిన తరుణం. కొన్ని ప్రాణులు వెళ్ళిపోక తప్పదు. ఎందుకంటే విశ్వం అనంతమే తప్ప, దాని సంతానం కాదు. ఆ నిజాన్ని మనం అంగీకరించాలి. జీవితం ఎంతో మహత్తరమైనదే. అయినప్పటికీ దాని క్షణిక స్వభావాన్ని అర్థం చేసుకోవాలి. నూతన సృష్టి జరగాలంటే పాతవి నశించిపోవాలి. ఈ సూత్రాలను మనం పవిత్రంగా భావిస్తున్నాం. ఆ సూత్రాల కోసం మనం 'వర్తమానం'లోని మన జీవితాలను త్యాగం చేయడానికి సంసిద్ధంగా ఉన్నాం. అయితే, అందుకని మాత్రమే మేమందరం ఇక్కడికి రాలేదు... పలు ప్రాణులు విగత జీవులై వాటి ఖాళీలను నింపడానికి ఇక్కడికి వచ్చాయి. విధి వాటిని ఇక్కడికి తరలించుకు రాలేదు. తనను ఉన్నతంగా భావిస్తూ, తక్కిన జాతుల ఉనికిని అసలు పట్టించుకోని ఒక భయంకరజాతి దురహంకార దురాశే వాటిని ఇక్కడికి వచ్చేలా చేశాయి.''

''మయూరీ!'' అని పిలిచింది పిచ్చుక.

''మనిషి చేసిన నేరాన్ని అతనికి నమ్మబలకడానికి మళ్ళీ నువ్వు ఆ భయంకరమైన అనుభవాలను గుర్తు చేసుకుంటూ బాధపడాలా?'' అని అడిగింది మొసలి దీనమైన కంఠస్వరంతో.

''వద్దువద్దు. నేను అనునిర్వకు కొత్తవాణ్ణే. కాని మీ వాళ్ళ ఆగ్రహం నన్ను సిగ్గుపడేలా చేస్తోంది. నన్ను నేను న్యాయపరచుకోవడానికి చెప్పుకునేందుకు ఏమీ లేదు. అయితే, మీరు వెలిబుచ్చుతూన్న ఆగ్రహం మనిషికి కొత్తేమీ కాదని మాత్రం చెప్పగలను. మాలో పలువురు జంతువుల రాజ్య విధ్వంసాన్ని వ్యతిరేకిస్తున్నారు,'' అన్నాను నేను ఆవేశంగా.

''జంతువుల రాజ్యం! జంతువుల రాజ్యం!'' అంటూ ఉరిమింది మమ్మత్. ''చూడండి. అతడెలా మనలనందరినీ ఒకేగాట కట్టేస్తున్నాడో!''

''జంతువుల రాజ్యం!'' అంటూ అరిచింది మొసలి. ''ఆ ఒక్క పదబంధంతో జంతుసంతతి నుంచి నిన్ను నువ్వు వేరు చేసుకుంటున్నావు. అవునా, కాదా? మా అందరికన్నా నువ్వు గొప్పవాడివని అనుకుంటున్నావు?''



Doctor | వైద్యుడు | ଡାକ୍ତର | Oriya | డాక్టర్

‘‘చూడండి. మీకు బాధకలిగించడం నా ఉద్దేశం కాదు. మిమ్మల్నెవరినీ కించపరచడానికి నేనలా అనలేదు. మానవజాతి మనుగడకు సకల ప్రాణులూ అవసరమని నాకు తెలుసు...’’ అన్నాను. అంతలో పిచ్చుక పొడిచేలా నా కళ్ళ వద్దకు ఎగిరి వచ్చి, ‘‘మేము మీకు సేవలు చేయడానికి రాలేదు మానవకుమారా! వర్తమానంలో మా జీవన లక్ష్యం అది కాదు. ‘మానవ జాతి మనుగడకు!’ ఎంత పొగరు! ఎంత పొగరు!’’ అన్నది పదునైన కంఠస్వరంతో.

నా నెత్తురు చల్లబడ్డట్టయింది. మయూరి మాటలను గుర్తు తెచ్చుకుని మౌనంగా ఉండిపోయాను. మయూరి గలగలా నవ్వసాగింది. ఆమె ఆనంద వికటాట్టహాసం చూసి చంద్రుడు భయంతో కంపించసాగాడు. నాకు సొమ్మసిల్లి పడిపోయేలా ఉంది. చెట్లు అదే పనిగా ఊగడంతో గాలి ఉధృతంగా వీచసాగింది. ‘భూకంపం!’ అన్నది మొసలి బిగ్గరగా. ‘‘ఛ... ఛ... మళ్ళీనా! విసుగ్గా ఉంది,’’ అన్నది మమ్మత్. మోహరిస్తున్న ఘోర విపత్తు గురించి వాళ్ళేమాత్రం ఉద్వేగం చెందుతున్నట్టు లేదు.



‘‘మనమేదైనా పైన కప్పుకోవడం మంచిది,’’ అంటూ నిట్టూర్చింది మమ్మత్. ఆ తరవాత లేచి అడవుల కేసి నడవసాగింది. దానికి వ్యతిరేక దిశలో మొసలి అమితవేగంతో పరిగెత్తసాగింది. మొదటి కదలికతోనే పిచ్చుక అడవుల కేసి ఎగిరి వెళ్ళిపోయింది. నాకంతా అయోమయంగా కనిపించింది. ‘‘అనునిర్వలో భూమి ఇంకా లేప్రాయంలోనే ఉంది. తరచూ ఒళ్ళు విరుచుకుంటుంది,’’ అన్నది మయూరి.

ఆ తరవాత మయూరి కొండల కేసి తిరిగి నడవసాగింది. నాకేం చెయ్యాలో, ఎక్కడికి వెళ్ళాలో తెలియలేదు. వెళుతూన్న మయూరిని వెనక నుంచి చూస్తున్నాను. రెండు చేతులు ఆకాశం కేసి ప్రార్థిస్తున్నట్టు పైకెత్తింది. ఆమె వెనక పరిగెత్తడానికి సాహసించలేకపోయాను.

‘‘ఆహ్వానం కోసం ఎదురుచూస్తున్నావా? త్వరగా, రా!’’ అని హెచ్చరించింది మయూరి. కొంత ఊరట కలిగింది. కాని మరుక్షణమే ఏదో ఇబ్బందికరమైన భారం మనసును కిందికి లాగసాగింది. ఆమె నమ్మదగినదేనా అన్న అనుమానం నాలో కలిగింది. ‘‘నువ్వు నన్ను నమ్మవని నాకు తెలుసు. నమ్మమని నేను చెప్పడం లేదుగానీ, నీకూ మరో మార్గం లేదు. కాబట్టి చెప్పింది, విను,’’ అన్న ఆమె మాటలు గాలిలో ఈటెల్లా దూసుకువచ్చాయి.

అవును. నిజమే. లెమన్, ఓమెన్, గువ్వా అందరూ ఎక్కడో దూరంలో ఉన్నారు. వాళ్ళు నాతో స్నేహంగా ఉన్నప్పటికీ తక్కిన అనునిర్వవాసుల నుంచి నన్ను కాపాడగలరా అన్నది



Doctor | వైద్యుడు | ડૉક્ટર | Gujarati | డాక్టర్

సందేహమే. పోరాటంలో మేము మరీ అల్పసంఖ్యాకులం. కొండనెక్కుతున్నప్పుడు మయూరి మరేమీ మాట్లాడలేదు. ఆమె అడుగులు వేస్తోంటే భూమి కంపిస్తోంది. ఆమె చుట్టూ ఉన్న బండలు, రాళ్ళు దొర్లిపడుతున్నాయి. అయినా, మేము ఎలాంటి అపాయమూ లేకుండా ముందుకు వెళుతూనే ఉన్నాం. ఆమెతో పాటు వెళ్ళడం వల్లనే నేను క్షేమంగా ఉన్నానని నాకు తెలుసు. చుట్టూ ఏవేవో నీడలు నేను ఫలానా అని గుర్తించేలోగా అవి వెనక్కి వెళ్ళిపోతూ ఉన్నాయి.

మేము కొండ శిఖరాన్ని చేరుకున్నాక, ''నువ్వు నా మాటలు వినకుండా, తగిన మూల్యం చెల్లించుకున్నావు. మండలి ఒప్పుకోకపోవచ్చు. అందుకు వాళ్ళనే నిందించగలవా? దూసుకువచ్చే బాణాలు, తొలిచే తుపాకీ తూటాలు దురహంకారపు విజయ హేళనా దృక్కులు ఇవే మానవ జాతి గురించిన వాళ్ళ చివరి జ్ఞాపకాలు,'' అన్నది మయూరి.

''మరి అలాంటి వాళ్ళవద్దకు నన్నెందుకు తీసుకువెళ్ళావు?'' అని అడిగాను.

''అనునిర్వలో నేను నిర్ణయాలు తీసుకుంటాను. నేను జీవన గడియారస్పందనను అధ్యయనం చేసి ప్రాణులు వెళ్ళడానికి సమయం గ్రహిస్తాను. నాకు ముందున్న 'ఒకరు' నాకా శక్తిని ఇచ్చారు. అయితే, నా సహచరులకు హాని కలిగించే ఏ పనినీ నేను చేయను. నీ జాతి చేత వాళ్ళు ఎలాంటి బాధలు అనుభవించారో నాకు తెలుసు. నేను నీకు మనస్ఫూర్తిగా మద్దతుతెలిపి అనునిర్వకు ఆహ్వానించానంటే, మండలి తీర్మానానికి విరుద్ధంగా, ఈ భూమిలో నెలకొన్న భావానికి వ్యతిరేకంగా ఆ పని చేసినట్టే అవుతుంది.''



''మరయితే, నాకు సాయపడడానికి నువ్వెందుకు అంగీకరించావు?''

''అది అంత సులభంగా చెప్పలేను. ఇక్కడ నన్నెంతగానో గౌరవిస్తున్నారు. వినయవిధేయతలతో నా ఆజ్ఞలను శిరసావహిస్తున్నారు. వర్తమానంలో నా రోజుల్లో, నేను మరీ చిన్నదిగా బలహీనంగా ఉండేదాన్ని. 1984 డిసెంబర్ 31వ తేదీ భోపాల్లో పుట్టాను.''

భోపాల్! నా మనసు సైన్సు పాఠ్యపుస్తకంలోని పర్యావరణ ఘోర ప్రమాదాల పుటలకేసి పరుగులు తీసింది. ప్రపంచంలో వాటిల్లిన అతిపెద్ద మానవ స్వయంకృత ప్రమాదాల్లో ఒకటి డిసెంబర్ మూడవ తేదీ జరిగిన భోపాల్ గ్యాస్ దుర్ఘటన! క్షణాల్లో రెండువేల మందికి పైగా ప్రాణాలు కోల్పోయారు. తరవాత ఏర్పడిన దుష్పరిణామాలూ తక్కువేం కాదు.



| Doctor | వైద్యుడు | ডাক্তৰ | Assamese | డాక్తర్ |
|---|---|---|---|---|

విషవాయువు ప్రభావంతో అసాధారణమైన అవయవాలతో... అరకొర అవయవాలతో, పిల్లలు పుట్టారు. ఈ దుర్ఘటన జరిగిన కొన్ని సంవత్సరాల తరవాత కూడా అంగవైకల్యాలతో, మానసికవైకల్యంతో పిల్లలు పుడుతూనే వచ్చారు. ఈ ఘోర ప్రమాదానికి కారణమైన కంపెనీ... పేరు గుర్తు లేదు... తనకేమీ సంబంధం లేనట్టు చేతులు కడిగేసుకున్నది.

ఈ విషయాలను గుర్తు చేసుకుంటూన్నప్పుడు నా చూపులు మయూరి నాలుగు చేతుల మీదా, నీలం రంగు ముఖం మీదా పడ్డాయి.

''అవును. అందుకు సాక్ష్యాన్ని కూడా చూడాలి కదా?'' అన్నదామె.

''నీ కేమయింది?'' అని అడిగాను కాస్త జంకుతూనే.



''నాకు జన్మనిచ్చిన తల్లి ఆ విషవాయువును శ్వాసించింది. నన్ను మంత్రసాని ఆమె వద్దకు తొలిసారిగా తీసుకు వెళ్ళినప్పుడు ఆమె స్పృహ కోల్పోయి ఉంటుంది,'' మయూరి వేదనతో నవ్వింది. ''నాలుగు చేతుల శిశువు దేవుడిచ్చిన కానుక అవుతుందా? కాదు కదా?''

భూమి కంపించడం ఆగిపోయిందని నేను ఉన్నట్టుండి గ్రహించాను. అంతవరకు ఆమె చెబుతున్న విషయంలో లీనమైపోయాను. ''ఆ విషాద దుర్ఘటనలో వేల మంది చనిపోయారు. నిజమే. ఆ దుర్ఘటన గురించిన ఆగ్రహం ఇంకా చల్లారలేదు. దాన్ని కారణంగా చూపి మానవ జాతినంతటినీ ద్వేషించడం భావ్యమా? నువ్వు కూడా మనిషివే కదా?'' అన్నాన్నేను.

''ఆ పేరుతో నన్ను పిలవకు! నేను వేరు రకం దానిని. కనిపించడం లేదా? నాకు ముందు అనునిర్వకు చేరినవారిలో అలాంటి వారు లేనట్టే నాకూ నా అనే వాళ్ళెవరూ లేరు. మమ్మల్ని మ్యూటెంట్స్ అంటారు. అంటే అసాధారణమైన వాళ్ళమన్నమాట! మాలో ప్రతి ఒక్కరికీ విలక్షణమైన గాయాలూ, బాధలూ ఉంటాయి. మా కథలన్నీ ఒకటి కావు. మాకు సమూహ స్పృహ ఉండదు. అందువల్లే మేము ఎలాంటి భయమూ లేకుండా పాలించగలం. ఎందుకంటే మేమెప్పుడు కూడా వలయంలో అంతర్భాగం కాము.''

ఆమె గాఢంగా నిట్టూర్చింది. ఒక్క కన్నీటి బొట్టు చెంప మీదుగా జారింది. దాని మీద వెన్నెల పడి మిలమిలా మెరిసింది.

''నేను తొలుత అనునిర్వకు వచ్చినప్పుడు నా వయసు ఐదేళ్ళు. నాకు ముందున్న 'ఒకరు' నా సంరక్షణా బాధ్యతలు స్వీకరించారు.'' ఆ



Doctor వైద్యుడు ഡോക്ടർ Malayalam డోక్టర్



తరవాత మాటాడలేక మౌనం వహించింది.

''అతడు ఇరవై మూడేళ్ళు 'వర్తమానం'లో జీవించాక విముక్తి లభించింది. అతడొకసర్కస్ కంపెనీలో పనిచేసేవాడు. ఒక వింత ప్రాణిగా ప్రదర్శించే వారు. ప్రజలందరూ వచ్చి అతణ్ణి చూసి అబ్బురపడేవారు. తమ ఎదుట ఉన్న ప్రాణికి కూడా సుఖ దుఃఖాలు అనుభవించే మనసూ, చూసే కళ్ళూ ఉంటాయని ఆలోచించే వారు కాదు.''

''సరే ఇప్పుడేంజరుగనున్నది?'' అని అడిగాను కొంతసేపయ్యాక. ఏదైతే అవుతుంది అనే ఒక విధమైన విరక్తి నిండిన మొండి ధైర్యం ఏర్పడింది. నాలోని భయం మటుమాయమయింది. మరణమే కదా హాయిగా వెళ్ళిపోదాం, అనుకోగానే నాలో ఒక విధమైన ఆనందం పెల్లుబికింది.

''ఎందుకు నవ్వుతున్నావు?'' అని అడిగింది మయూరి.

''నిజానికి నాకే తెలియదు,'' అన్నాను ఇంకా పెద్దగా నవ్వుతూ. కల్పనా కథలో పాత్రలా నాకు నేను కనిపించాను. ''ఇదంతా కల,'' అంటూ మాత్రం నా కథ ముగియబోదు.

మయూరి నవ్వుతూ, ''నువ్వు క్షేమంగా ఉంటావు. నేను మాట ఇస్తున్నాను,'' అన్నది.

''ఎలా చెబుతున్నావు?''

''నేను మండలితో మాట్లాడతాను.''

''ఎందుకు?''

''ఎందుకు అంటే?''

''నువ్వెందుకలా నా కోసం అంత పెద్ద ప్రయత్నం చేస్తున్నావు?''

''నీకింకా నా మీద నమ్మకం కుదరలేదా బాబూ? సరే. నాకున్న కారణాలు నాకూ ఉన్నాయి. నీకు ఋణపడి ఉన్న వ్యక్తి నీకు సానుకూలంగానే ఉంటుంది కదా?'' ఆమె చెబుతున్నదేమిటో నాకు అర్థం కాలేదు.

''మరికొన్ని గంటలలో సూర్యోదయమవుతుంది. నేను నీకు కబురు పంపేంతవరకు డోడో దంపతుల వద్దే ఉండాలి,'' అన్నది మయూరి.

''ఆ తరవాత?''

''మండలి నీకు మద్దతునివ్వదు. అయితే, నేను దాన్ని మార్చగలను. ఇంకా నేను 'ఒకరు.' గుర్తుంది కదా?''

''మా తాతయ్య, నా కుక్క?'' అన్నాను.

''వాళ్ళను కూడా రక్షిస్తాను,'' అన్నదామె.

ఆమె శిరోజాల గుండా గాలి రివ్వున దూసుకుపోయింది. చంద్రుడు ఆమె మోము మీదికి వెన్నెలలు వెదజల్లాడు. ఆమె విషాద సౌందర్యం నాలో ఒక విధమైన కరుణాద్భుత విచిత్ర భావాన్ని రేకెత్తించ్చింది. నేను తలాడించాను.

నన్ను నేను ఆమె ఋణానుబంధంలో ఉంచాలనుకున్నాను. - (ఇంకావుంది)

- సౌమ్యా రాజేంద్రన్



Doctor వైద్యుడు ᱰᱟᱠᱴᱚᱨ Santali డాక్తోర్

# జయ్‌ప్రీత్ ఘుమాన్

గెలుపొందిన అవార్డులు:

- 2007లో మోస్ట్ ఇంప్రూవ్డ్ గోల్ఫర్‌గా ఇండియన్ గోల్ఫ్ యూనియన్ లేడీ సెక్షన్ కన్వీనర్స్ అవార్డు.
- చండీఘర్ అమెచ్యూర్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్ ట్రోఫీ విజేత (U-15 కేటగిరి) 2009.
- చండీఘర్ లేడీస్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్-బావాగిల్ ట్రోఫీ విజేత(2009).
- 92వ ఆలిండియా లేడీస్ అమెచ్యూర్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్-ఎవియం ట్రోఫీ విజేత(2007)
- చండీఘర్ రాష్ట్ర గోల్ఫ్ ఛాంపియన్‌షిప్ విజేత(2008).
- లలిత్ సూరి జూనియర్ గోల్ఫ్ టోర్నమెంట్ విజేత (U-15 కేటగిరి) 2008.
- చండీఘర్ లేడీస్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్ ఛాలెంజ్ బౌల్ అండ్ బావా గిల్ ట్రోఫీ విజేత(2008).

చండీఘర్‌కు చెందిన యువగోల్ఫర్ జయ్‌ప్రీత్ ఘుమాన్ పన్నెండవ యేటే గోల్ఫ్ ప్రపంచంలోకి అడుగు పెట్టింది.

ఆమె తల్లిదండ్రులు కూడా ప్రొఫెషనల్ గోల్ఫర్స్ కావడంతో, ఆమెకు అవసరమైనప్పుడల్లా సహాయసహకారాలు అందించి ప్రోత్సహిస్తున్నారు.

కోచ్ జెస్సీ గ్రెవాల్ మార్గదర్శకత్వంలో చండీఘర్‌లోని సిజివి హోండా గోల్ఫ్ అకాడెమీలో ఆమె ప్రాక్టీస్ చేస్తోంది. కొన్ని సంవత్సరాలలోనే ఆమె గోల్ఫ్‌లో ఆశించిన దానికన్నా ఎంతో ఎక్కువ సాధించగలనని నిరూపించింది.

''బాగా కష్టపడి గరిష్ఠ స్థాయికి చేరుకోవడానికి మనం ప్రయత్నించకపోతే మనలోని శక్తి సామర్థ్యాలను ఎలా పూర్తిగా వినియోగించుకోగలం!'' అన్నదే జయ్‌ప్రీత్ మనోభావం; క్రీడా తత్వం!

ఏ క్రీడాకారుడుగాని పరిపూర్ణత సాధించలేడు; ఎంత సాధించినప్పటికీ ఇంకా అభివృద్ధికి ఆస్కారం ఉండి తీరుతుంది అన్నదే ఆమె అభిప్రాయం.

ప్రొఫెషనల్ గోల్ఫర్ కాకపోయినప్పటికీ, అమెచ్యూర్‌గా ఆడుతూ, ఏదో ఒక రోజు ఇండియాకు ప్రాతినిథ్యం వహించాలన్నదే ఆమె ఆకాంక్ష



''మీరు అభిమానించే క్రీడను బాగా ఆడి మీ కలలను సాకారం చేసుకోండి. ఆనందించండి ఎందుకంటే జీవితం చాలా చిన్నది!'' ఇదే ఆమె క్రీడాభిమానులకు ఇచ్చే సందేశం!

ఈ నెల ఉదయతార జయప్రీత్‌ఘుమాన్‌కు చందమామ శుభాకాంక్షలు!



| Doctor | వైద్యుడు | वैद्यः | Sanskrit | వైద్యః |
|---|---|---|---|---|

## భారతీయుడికి నోబెల్ బహుమతి!


Image Courtesy: http://freedigitalphotos.net

ఈ సంవత్సరం రసాయనిక శాస్త్రానికి నోబెల్ బహుమతి మన దేశంలో పుట్టి అమెరికాలో స్థిరపడిన వెంకటరామన్ రామ కృష్ణన్ మరో ఇద్దరితో కలిసి అందుకుంటున్నారు. యేల్ విశ్వ విద్యాలయానికి చెందిన థామస్ ఎ స్టెట్జ్, ఇజ్రాయెల్ వియ్‌జ్ మన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్‌కు చెందిన అడా ఇ యోనత్‌లతో కలిసి రైబోసోమ్ నిర్మాణం, పని చేసే తీరు మీద చేసిన పరిశోధన లకు ఈ బహుమతి అందజేస్తున్నారు.

వైద్యవిద్యకు సీటురాకపోవడంతో భౌతికశాస్త్రంలో బరోడాలో పట్టభద్రుడైన రామకృష్ణన్, ఓహియో యూనివర్శిటీలో పిహెచ్‌డి, యూనివర్శిటీ ఆఫ్ కాలిఫోర్నియాలో బయోలజీలో మాస్టర్స్ డిగ్రీ చేశారు. తమిళనాడు చిదంబరంలో జన్మించిన ఈ నోబెల్ బహు మతీ గ్రహీత చాలా నిరాడంబరుడు!

## అతిపెద్ద సామూహిక వివాహం

ఒక పెళ్ళి చేయడమంటే మామూలు విషయం కాదు. అందుకు ఎన్నో తతంగాలు ఉన్నాయి. అలాంటిది, ఒకేచోట ఒక్కసారిగా 7,500 వివాహాలు జరిపించడం అంటే మాటలా? అరుదైన ఈ సామూహిక వివాహవేడుక ఇటీవల దక్షిణకొరియాలో జరిగింది. యూనిఫికేషన్ చర్చ్ ఏర్పాటు చేసిన ఈ సామూహిక వివాహంలో దక్షిణకొరియా, వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన వధూవరులు వివాహ బంధ ప్రమాణాలు చేశారు.


Image Courtesy: http://freedigitalphotos.net

వివాదాస్పదమైన చర్చ్ సంస్థాపకుడు ఎనభైతొమ్మిదేళ్ళ రెవరెండ్ సన్ మైయూంగ్ మూన్ ఆధ్వర్యంలో ఈ బ్రహ్మాండమైన వివాహం జరిగింది. నూతన దంపతులు అమితానందంతో ఉంగరాలు మార్చుకునే ముందు వాళ్ళమీద మైయూంగ్‌మూన్ పవిత్రజలాలు చిలకరిం చాడు. ఆ తరవాత ఆశీర్వదించాడు. చాలా మంది వధువులు తెల్లటి దుస్తులు ధరించి వచ్చారు.



| Room | గది | कमरा | Hindi | కమ్‌రా |
|---|---|---|---|---|



# నవ్వుల పువ్వులు



మనీష్: నువ్వెందుకు ఇంకా పెళ్ళి చేసుకోలేదు?
ప్రేమ్: ఐడియల్ మ్యాచ్ కోసం వెతుకుతున్నాను.
మనీష్: అంటే నీకింకా నచ్చిన అమ్మాయి కనిపించలేదన్నమాట!
ప్రేమ్: ఒక అమ్మాయి నచ్చింది.
మనీష్: మరి, చేసేసుకోవచ్చు కదా?
ప్రేమ్: ఆ అమ్మాయి తనకు తగ్గ ఐడియల్ మ్యాచ్ కోసం వెతుకుతున్నది!



తాతయ్య ఒడిలో కూర్చున్న పసివాడు, ''దేవుడు నన్ను తయారు చేశాడా?'' అని అడిగాడు. ''అవును,'' అన్నాడు తాతయ్య.
''నిన్ను కూడా దేవుడే తయారు చేశాడా?'' అని అడిగాడు పసివాడు.
''అవును,'' అన్నాడు తాతయ్య.
పసివాడు తాతయ్య శరీరంమీది ముడతలను వేళ్ళతో తడుముతూ, పలచబడిన వెంట్రుకలను చూస్తూ, ''అవును, అతడు ఇప్పుడిప్పుడే మెరుగ్గా తయారు చేస్తున్నాడు!'' ఉన్నాడు.



కస్టమర్: రోజూ కప్పు కాఫీకి డబ్బులు తీసుకుంటున్నావు. మరి ఈ రోజు ఉచితంగా ఇస్తే అద్భుతంగా ఉంటుంది కదా?
వెయిటర్: అవును బాబూ! రోజూ తమరు కప్పు నిండుగా కాఫీ తాగుతారు. మరి ఈ రోజు ఖాళీగా ఉన్న కప్పు నుంచి కాఫీ తాగితే ఇంకా అద్భుతంగా ఉంటుంది!

## అల్లరి దత్తు










Room గది அறை Tamil అరై



# హాస్యకథ

## ఒకటి కన్నా ఎక్కువ

ఒకనాటి సాయంకాలం అక్బర్ చక్రవర్తి రాజోద్యానంలో పచార్లు చేస్తున్నాడు. ఆయనా, బేగం కబుర్లు చెప్పుకుంటూ, చుట్టూ ఉన్న అందమైన పూలను చూస్తూ, చలవరాతి మార్గంలో మెల్లగా అడుగులు వేస్తున్నారు.

''మనకన్నా ముందు పూల సువాసనను ఆస్వాదించే గాలి భలే దొంగ?'' అన్నాడు రాజు నవ్వుతూ.

''షహేన్ షా సమక్షంలోనే అలాంటి నేరానికి ఒడిగట్టి శిక్షింపబడకుండా తప్పించుకునేది గాలి ఒక్కటే ప్రభూ!'' అంటూ నవ్విన బేగం, ''నిజంగానే ఉద్యానవనం, స్వర్గంలా ఉంది,'' అన్నది.

''అవును. భూమి మీద స్వర్గం అంటూ ఉంటే, నిస్సందేహంగా అది ఇక్కడే ఉంది,'' అన్నాడు చక్రవర్తి.

''భూమి మీద అతి గొప్ప పాలకులైన మీరూ ఇక్కడే ఉన్నారు,'' అన్నది బేగం చక్రవర్తిని ప్రశంసిస్తూ.

''ఒక విధంగా అదీ నిజమే బేగం షాహీబా! అయినా, అందుకు కారణం కేవలం నా గొప్పదనమే కాదు. నా గొప్పకు కారణం నా ఆస్థానంలోని మంత్రులు, మేధావులు, కళాకారులు. ప్రతి సందర్భంలోనూ వాళ్ళు నాకు సరైన సలహాలు ఇస్తారు. వాటిని నేను పాటిస్తాను. సత్ఫలితాలను రాబడతాను. నా ఆస్థానంలోని నవరత్నాలనే చూడు. ప్రపంచంలోనే అతి పెద్ద సంగీత విద్వాంసుడు తాన్‌సేన్. రాజామాన్‌సింగ్ లాంటి రాజపుత్రయోధుడు సైన్యాన్ని నడుపుతూ విజయాలను నా వశం చేస్తున్నాడు. ఇక తెలివితేటల విషయానికి వస్తే, బీర్బల్‌కు మించిన వాళ్ళంటూ ఎవరైనా ఉన్నారా?'' అన్నాడు చక్రవర్తి ఆనందంతో ఉప్పొంగిపోతూ.

''మీ ఆస్థానం నిజంగానే రత్నాల నిలయం... అయితే...'' అంటూ బేగం పచ్చిక మీద ఎగురుతూన్న మిడతను చూపుతూ, ''అది ఎంత పచ్చగా ఉందో చూశారా! అది ఎగరలేదంటే దాన్ని పచ్చటి గడ్డి మీద కనిపెట్టడం కష్టం!'' అన్నది.





| Room | గది | घर | Bengali | ঘর |
|---|---|---|---|---|



''అందుకే కదా అది ఎప్పుడూ గెంతుతూనే ఉంటుంది,'' అంటూ నవ్వినచక్రవర్తి ''అవునూ, నువ్వు అయితే... అంటూ ఆగిపోయావు. ఏమిటి ఆ అయితే?'' అని అడిగాడు.

''ఈ మాట అంటున్నందుకు అపార్థం చేసుకోకండి. మీరు మీ ఆస్థాన పండితుల శక్తి సామర్థ్యాలను ఎక్కువగా అంచనా వేస్తున్నారనుకుంటాను,'' అన్నది బేగం వినయంగా.

''అదెలా చెప్పగలవు? బీర్బల్‌కు మించిన తెలివి గల వాళ్ళను నువ్వు చూపగలవా?'' అని అడిగాడు చక్రవర్తి.

''ఉండవచ్చు కదా?'' అన్నది బేగం.

''లేదని ఇంతకు ముందు అతడు నిరూపించాడు కదా?'' అని అడిగాడు చక్రవర్తి.

''ఆ సంగతి నాకూ తెలుసు. నేనూ అతడి తెలివి తేటలనూ, సమయస్ఫూర్తినీ గౌరవిస్తాను. అయితే, నా పరిచారికల ద్వారా ఒక సంగతి తెలియవచ్చింది. పొరుగురాజ్యం నుంచి ఒక పండితుడు వచ్చి, తను మొగల్ ఆస్థానంలోని ఉత్తమ మేధావికన్నా, చాలా తెలివిగల వాడినని చెబుతున్నాడట!'' అన్నది బేగం.

''అబద్ధం చెబుతున్నాడు,'' అన్నాడు చక్రవర్తి వెంటనే.

''అతణ్ణి చూడకుండానే మీరు అంత గట్టిగా ఎలా చెప్పగలరు షహెన్‌షా! ఆ పండితుడు తన మాటను రుజువు చేయగలనని కూడా అందరితో చెబుతున్నాడట,'' అన్నది బేగం చిన్నగా నవ్వుతూ.

''అలాగా! అయితే రేపే రాజసభకు రమ్మని నీ పరిచారికతో కబురు పంపించు. సభలోనే పరీక్షించి, బీర్బల్ కన్నా తెలివైనవాడేమోనని చూసేద్దాం,'' అన్నాడు చక్రవర్తి.

బేగం సరేనన్నట్టు తల ఊపింది.

ఎప్పటిలాగే మరునాడు కూడా చక్రవర్తి రాకముందే సభాసదులందరూ సభకు వచ్చేశారు. చక్రవర్తి రాగానే లేచి నిలబడి అభివాదాలు తెలియజేశారు. చక్రవర్తి ఆసనంలో కూర్చోగానే సభ ప్రారంభమయింది. ఆనాటి ముఖ్యమైన సమస్యలు పరిష్కరించాక, రాజదర్శనానికి ప్రత్యేక అనుమతి పొందిన వారిని లోపలికి ప్రవేశపెట్టే కార్యక్రమం మొదలయింది.

కాపలాభటుడు లోపలికి వచ్చి చక్రవర్తికి నమస్కరించి, ''పొరుగు రాజ్యం నుంచి ఒక పండితుడు తమ దర్శనానికి వచ్చి వేచి ఉన్నాడు, షహెన్ షా,'' అన్నాడు.

చక్రవర్తి ప్రవేశపెట్టమని తలూపడంతో భటుడు వెళ్ళి, లావుగా పొట్టిగా ఉన్న ఒక మధ్య వయస్కుణ్ణి లోపలికి వెంటబెట్టుకుని వచ్చాడు. అతడి జుట్టు, గడ్డం మీసాలు అక్కడక్కడ నరిసి



Room గది खोली Marathi खोली

ఉన్నాయి. అతడు వంగి చక్రవర్తికి గౌరవసూచకంగా నమస్కరించాడు.

''రాజసభకు స్వాగతం! నీకేం కావాలో చెప్పు,'' అంటూ చక్రవర్తి అతణ్ణి అడిగాడు.

''ప్రతి రంగంలోనూ ఉత్తములైన వ్యక్తులు తమ కొలువులో ఉన్నారని విన్నాను. మరి నాలాంటి అత్యుత్తమ పండితుడికి అందులో స్థానం లేకపోవడం ఏమిటా అని వచ్చాను షహేన్ షా,'' అంటూ అతడు ఒకసారి సభను కలయ చూశాడు.

''అంటే, మా ఆస్థానంలో అందరికన్నా నువ్వే తెలివైన వాడివని అనుకుంటున్నావా?'' అని అడిగాడు చక్రవర్తి కనుబొమలు ముడివేసి.

''ఆ సంగతి రుజువు చేయడానికి సిద్ధంగా ఉన్నాను షహేన్ షా,'' అన్నాడా వ్యక్తి.

సభలోని వారందరి చూపులూ ఆ వ్యక్తి మీద పడ్డాయి. సభలోని వారందరిలోకీ బీర్బల్ తెలివైన వాడు అని వాళ్ళకు తెలుసు. సమయస్ఫూర్తితో, చతురోక్తులతో అతడు ఎవరినైనా ఇట్టే ఆకట్టుకోగలడు. ఇలాంటి మాటకారికి అతడే దీటుగా నిలబడ గలడని భావించారు. అందరూ తనకేసి చూడడంతో బీర్బల్ చిన్నగా నవ్వాడు.

''బీర్బల్, నువ్వేమంటావు?'' అని అడిగాడు చక్రవర్తి.

''మీ ఆజ్ఞను శిరసావహించడమే నా కర్తవ్యం ఆలంపనా,'' అంటూ లేచి నిలబడ్డ బీర్బల్, చక్రవర్తికి వంగి సలాం చేశాడు.

''ఈ పండితుడితో వాదించడానికి నేను సిద్ధంగా ఉన్నాను. అయితే, అతడి పరీక్షా విధానం ఏమిటో ముందు తెలుసుకోవాలి కదా,'' అన్నాడు మళ్ళీ.

''నా దగ్గర వంద ప్రశ్నలు ఉన్నాయి. తొలి ప్రశ్నల కన్నా తరవాతివి కఠినంగా ఉంటాయి. నేను వాటిలో ఒకదాని తరవాత ఒకటి వరసగా అడుగుతాను. వాటన్నిటికీ సరైన సమాధానాలు చెప్పగలిగితే, నిన్ను నాకు సాటిరాగల పండితుడిగా అంగీకరిస్తాను,'' అన్నాడు ఆ వ్యక్తి.

''నూరు ప్రశ్నలడుగుతూ కాలం వృథా చేయడం దేనికి? ఒకే ఒక్క ప్రశ్నను అడిగి తేల్చుకోవడం ఉత్తమం కదా? నీ దగ్గర ఉన్న చాలా కష్టమైన ఒక ప్రశ్నను, అంటే నువ్వు చివరగా అడగదలుచుకున్న ప్రశ్నను మొదటే అడుగు. సమాధానం చెబుతాను,'' అన్నాడు బీర్బల్.

''అర్థవంతమైన ఆలోచన,'' అన్నాడు చక్రవర్తి.

వచ్చిన పండితుడు ఆలోచనలో పడ్డాడు. ఆ సూచన అతడికి అంత ఆమోదయోగ్యంగా కనిపించకపోయినా, అంగీకరించక తప్పలేదు.

''సరే, అలాగే అడుగుతాను. అడగమంటావా?'' అన్నాడు.





Room గది ಕೋಣೆ Kannada కోణే

''అడుగు,'' అన్నాడు బీర్బల్ చిన్నగా నవ్వుతూ.

''లోకంలోకి మొదట వచ్చింది కోడిగుడ్డా, కోడిపిల్లా?'' అని అడిగాడు పండితుడు ఎంతో గంభీరంగా.

ఇది చాలా చిక్కు ప్రశ్న. ఏది మొదలు అని ఎవరు మాత్రం రూఢిగా చెప్పగలరు? కోడి పిల్లలు గుడ్ల నుంచి వస్తాయి. పిల్లలు పెద్దవై కోళ్ళు, కోడిపుంజులుగా పెరుగుతాయి. కోళ్ళు గుడ్లు పెడతాయి. గుడ్లు పొదిగితే పిల్లలు పుట్టుకు వస్తాయి. కాబట్టి బీర్బల్ ఏది చెప్పినా పండితుడు తప్పు అనే ప్రమాదం ఉంది.

రాజుతో సహా అందరిలోనూ ఒత్తిడి చోటు చేసుకుంది. బీర్బల్ చిక్కుల్లో పడ్డాడని అందరూ అనుకున్నారు.

అయితే, బీర్బల్ ఏమాత్రం జంకు లేకుండా,



''కోడిపిల్లే మొదట వచ్చింది,'' అన్నాడు బీర్బల్ నిస్సందేహంగా.

''అది నీకెలా తెలుసు?'' అని అడిగాడు పండితుడు విజయగర్వంతో.

''నువ్వు, పోటీ నిబంధనలు మరిచిపోయావా?'' అని ఎదురు ప్రశ్న వేశాడు బీర్బల్ నవ్వుతూ.

''నిబంధనలేమిటి?'' అంటూ ఆశ్చర్యపోయాడు పండితుడు

''నువ్వు ఒకే ఒక ప్రశ్న అడగాలని మనం నిబంధన ఏర్పరచుకున్నాం. అందుకు నువ్వు అంగీకరించావు. ఒకే ఒక ప్రశ్న. నీకు తెలిసిన చాలా కఠినమైన ప్రశ్నను అడిగావు. నేను దానికి సమాధానం చెప్పాను. మరి ఇప్పుడేమో 'అది నీకెలా తెలుసు!' అని రెండవ ప్రశ్న అడుగుతున్నావు. అది ఒకటి కన్నా ఎక్కువ కదా? ఆ ప్రశ్నకు సమాధానం చెప్పవలసిన అవసరం నాకు లేదు, పండితవర్యా,'' అన్నాడు బీర్బల్ దృఢమైన కంఠస్వరంతో.

పండితుడు నిర్విణ్ణుడయ్యాడు. ఏం చెప్పాలో తోచలేదు. నోట మాట రావడానికి కొంతసేపు పట్టింది. చక్రవర్తికీ, బీర్బల్‌కూ వంగి నమస్కరించి, ''షహెన్ షా, నేను పొరబడ్డాను. మీ ఆస్థానంలోని వారందరూ గొప్పవాళ్ళే. వారిలో బీర్బల్, నిస్సందేహంగా చాలా తెలివైనవాడు,'' అన్నాడు. చక్రవర్తి పండితుణ్ణి బంగారు నాణాలతో సత్కరించి సాగనంపాడు. ఆ తరవాత బీర్బల్‌కేసి తిరిగి, ''బీర్బల్, మన ఆస్థాన గౌరవాన్ని కాపాడిన నిన్ను మనసారా అభినందిస్తున్నాను. నీ సమయస్ఫూర్తికీ, తెలివి తేటలకూ జోహార్లు!'' అంటూ బంగారు నాణాలు గల పట్టుసంచీతో అతడికేసి అడుగులు వేశాడు.



Room గది ଘୋଡି Oriya కోఠరి

CHANDAMAMA (Telugu) December 2009 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11






# బుబ్బా జట్టు సాహసాలు




























